# బలి

రచన:

శ్రీ రవీంద్రనాథ్ ఠాకూరు

అనువాదం:

యస్. బ్రహ్మయ్య, బి. ఏ., బి. యల్.

ప్రచురణ:

శ్రీ కళా సమితి

బద్వేలు.

# బలి

రచన:

శ్రీ రవీంద్రనాథ్ టాకూరు

అనువాదం:

యస్. బ్రహ్మయ్య, బి. ఏ., బి. యల్.

ప్రచురణ:

లలితకళా సమితి

బద్వేలు.

Approved by the Director of Public Instruction, Andhra Pradesh for use in all the Libraries in the State in his R. C. No. 67 M 4/57 dated 20-4-57.

ప్రథమ ముద్రణ : జయ, మాఘ.

ద్వితీయ ముద్రణ : ప్లవ, మార్గశిర.

వెల :

రూ 1-25

ముద్రణ:

క్రాంతి ప్రెస్, 12-ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్,

మద్రాసు-1.

# అంకితము

---

కీర్తిశేషురాలైన నా సహధర్మచారిణి

## అనసూయాదేవికి

పరగ ప్రకాశవంతమయి భాసిలు నెన్నియొ జాతి రత్నముల్
కరము గభీర సంతమస కంధి గుహాంతరమందణంగెడున్
పరిమళ పుష్పసంతతి శుభాకృతి దాల్చి వనాంతరంబులన్
కఱకు ఎడారి గాడ్పులకు గాసిలి సార విహీనమై చెడున్.

("గ్రే" కవి ఎలిజీనుండి.)

# OPINION

THE HINDU, dated 31—3—1957

**BALI**

*Translated by* S. BRAHMAIAH, B.A. B.L.,

This is a translation of Tagore's 'Sacrifice'. It is one of his most powerful plays wherein he makes a veiled attack on some aspects of Hindu doctrine and rituals He does not believe in propitiating God by the blood of his own creation and he strongly disapproves the killing of innocent animals in his name.

The translator has tried his utmost to retain the grace and vigour of the original.

P. T. ACHARYA

# పండితాభిప్రాయములు

శ్రీ రవీంద్రుని యుత్తమ కృతులలో 'విసర్జన', 'రాజా-రాణి' అను వాని యనువాదమీ రచన. అనువాదకులు శ్రీ ఎస్. బ్రహ్మయ్య బి. ఏ., బి. యల్., గారు. 'బలి'యను పేరఁ బ్రకటితమైన దృశ్యకావ్య ద్వయ సంపుటి యిది.

కథా వస్తువుతో నీరెండు కృతులీనాఁడు భారతీయ హృదయాకాశమున నిరంతరము వెలుగవలసిన జ్యోతిర్మూర్తులు - తేజోమయములు! అమృతమయములు!!

దేవుఁడు - భక్తి, మతము - సంప్రదాయము, ప్రేమ - ధర్మము, రాజు - ప్రజలు, కీర్తి - త్యాగము - ఇత్యాదుల బాహ్యరూపము లేవో, హృదయము లేవో, అంతరాత్మ యేదో, యనుష్ఠానమేదో రవీంద్రుఁడు చక్కగ నిందు పొందు పఱచినాఁడు. ప్రతిభావంతమైన వాక్కులతోఁ బరిణత మధు స్రవంతియైన రచనతో అంతర్వాహినులైన రసనాడులతో గూడుకట్టిన యీ మధుర కావ్యఫలము దాస్యపరాధీనతా కలుషిత గత భారత జాతీయ జీవన విష వృక్షమునఁ బండిన అమృత ఫలములో నిది యొక్కటి. ఇంతేగాదు స్వతంత్ర భారత జాతీయ జీవనమునకుఁ బుష్టిని ఓజస్తేజస్సులను బ్రసాదించు నుత్తమ కావ్యములలో నిది యత్యుత్తమమనుట యత్యుక్తి కాఁ

జాలదు. ఇఁక జక్కఁగ దీని నుపయోగించుకొను భారము మన వంతుకు మిగిలియున్నది.

ఈ యనువాదములో శ్రీ బ్రహ్మయ్య గారాంధ్ర జాతికి సాహిత్యమునకుఁ దనవంతు సేవ తన భాగమునకన్న మిక్కిలిగనే యప్పగించి కృతార్థులైరని చెప్పవచ్చును. గంభీర భావగర్భితములైన రవీంద్రుని రచనల ననువదించుటకుఁ జేయెత్తుట సాహసమేయైనను, ఈయన లేఖిని యెచ్చటను దొట్రువడలేదు, బద్ధకింపలేదు, రేఖాతిక్రమణము చేయలేదు. లేఁత ముదురు రంగులు తీర్చిదిద్దుటలోఁ దారుమారుచేసి రూప వికృతి పుట్టింపలేదు. పెప్పలనుండి తొంగిచూచు - అధరము నుండి వెలికిజారు హృదయామృతము నెచ్చటను విఱిగి పోనీ లేదు - ఇగిరి పోనీలేదు. ఇది ఈయనకుఁ దెనుఁగు పలుకుబడిలో కూర్పు తీర్పులోఁగల నేర్పునకుఁ జక్కని తార్కాణ కాఁగలదు. ఇంతకంటె రసవదనువాదములు మనము కోరు కొందుము. కాని అది మన రస పిపాసా లాలసత మాత్రమే యనఁదగును.

ఈయన కృషిని నేను హృదయపూర్వకముగా నభి నందించుచున్నాను. దీనిని సదుపయోగముఁ జేసికొని యాంధ్ర లోకము తన రసజ్ఞతను సారస్వతాభిరుచిని వెల్లడింపవలెనని కోరుచున్నాను. విద్యా శాఖాధికారులీ పొత్తమును బాఠ్య ముగా నిర్ణయించి యౌచిత్యము నెఱపినచో నది విద్యార్థులకు

మహోపకారము, రచయితకుఁ బ్రోత్సాహకము కాఁ గలదని నా విశ్వాసము.

విజయ, దీపావళి

ఇట్లు,

గడియారము వేంకటశేషశాస్త్రి M. L. C.,
(విద్వాన్, కవిసింహ, అవధాని పంచానన, శతావధాని,
మహాకవి, శ్రీ శివభారత గ్రంథకర్తలు.)
సీనియర్ తెనుఁగు పండితులు, పురపాలకోన్నత
పాఠశాల, ప్రొద్దుటూరు, కడప జిల్లా.

---

ఆర్యవర్య,

తమరు సప్రేమముగఁ బంపిన నాటికా ద్వయమును ఆమూలాగ్రము పఠించితిని. విశ్వకల్యాణమును వాంఛించి విశ్వభారతీ ప్రతిష్ఠాపకులగు శ్రీ రవీంద్రనాథ ఠాకూరు మహాకవి మహాశయుఁడు జనసామాన్యమునకేమి, పండిత లోకమునకేమి, తీర్చిదిద్ది యుపదేశించిన యుపదేశములు శిరోధార్యములు, సంతతానుసరణములు. జన సమాజ శిక్షణకుఁ బూర్వులు తమ భావానా సముద్రమును దఱచితఱచి కావ్యరచన యుక్తమని నిర్ణయించిరి. ఆ కావ్యములను రెండు తెగలు విభజించి, జ్ఞాన బోధకును, శీఘ్ర పరివర్తనమునకును, జగత్కల్యాణ సంపాదనమునకును దృశ్య కావ్యములు ప్రధానములని భావించి చిన్నచిన్న నాటికలు రచించిరి. పెద్దల యుద్దేశ్యమును ప్రమాణమని పరిగ్రహించి శ్రీ రవీంద్రనాథ ఠాకూరు మహాకవి అత్యంత గూఢములయిన భావములు జన

సమాజమునకు నీతి బోధకములు, నుద్వికల్ప జ్ఞానయుక్తములు నగు వాక్యములతో నాటకములు రచించి యనంత కీర్తిని సంపాదించిరి. తద్యశఃకాయమునకుఁ గల ప్రతిభ యెవ్వారికిని లేదనవలయు. వారి సహజ కవితాస్రవంతి నిరర్గళముగ మధురస పూరితమయి ప్రపంచము నందంతటఁ బ్రవహించి జనసమాజము నుజ్జీవింపఁజేసినది. ఆ నిర్మల ప్రవాహమున మునిఁగి తద్రస మాధుర్యమును గ్రోలి యానందించిన వారు పెక్కురు గలరు. ఆ రచన వంగభాష యందును, ఆంగ్ల భాష యందును వెలయుటంజేసి యితర భాషల యందును అనువదింపఁబడి యెల్లరకు సేవ్యముగఁ జేసి మహాకవులు కొందఱు ధన్యజీవులయిరి. అగుచున్నారు. కాఁగలరు. ఈ విధముగ సుకృత శరీరులగు మహాకవులు నిశ్చయముగ సార్థకజన్ములని యెంచవలయు ననుట నిస్సంశయము.

అట్టి కృతకృత్యులలో ఈ నాటికాద్వయము ననువదించి లోకసేవయు, భాషాసేవయుఁ గావించిన వారు తమరని చెప్పిన యతిశయోక్తి యని యనుకొందురేమో. ఆ యూహ సర్వదా కాదని నేను నొక్కి వక్కాణించుచున్నాను.

గంభీరములగు భావములను అవగాహనము చేసికొని, చక్కని తెలుఁగు భాషలో సుసులభముగఁ జదువువారి హృదయముల కానందమును గలిగించునట్లు రచించిన మీ రచన నిరుపమానమని చెప్పఁగలను. ఒక్కొక్క నాటికయు జదువఁ బూనినఁ దుదివఱకుఁ జదువనిదే చాలింప మనసు గొల్పని యట్టి

భావములతోను, కల్పనా చమత్కృతి తోడను వెలయు చున్నది.

భాషా ప్రపంచములో కేవల వ్యావహారిక భాషయే సుగమ్యమనియు, నిత్యానందము గూర్చుననియు, నెల్లరకు హృదయంగమముగ నుండుననియు, స్వేచ్ఛకు దావలముగ నుండుననియుం బ్రచారము విరివిగా సాగుచుండు నీకాలమునం దమరు ప్రాచీన సంప్రదాయముల కవిరుద్ధముగ (శ్రీ) ఠాకూరు మహాకవి రచనకు సార్థకముగ నుండునట్లు నియమబద్ధమగు రచన సాగించిన యుద్యమము మిక్కిలి స్తుతిపాత్రమని యత్యంతానంద సాంద్రమానసమున నుగ్గడించు చున్నాను.

ఇతివృత్తమును గుఱించియుం గథా సంవిధానమును గూర్చియు విమర్శింప నవసరము లేదని ఘంటాపథముగం జెప్పంగలను. ఇట్లే తమ కలము దేశసేవకు, సంఘసేవకు, సారస్వత సేవకు మున్ముందు సంపూర్ణోత్సాహముతో నడిపింప సర్వేశ్వరుని దీర్ఘాయురారోగ్య భాగ్యముల నొసంగుంగాత యని కోరుచున్నాను.

ఈ గ్రంథము కళాశాలలయందలి విద్యార్థుల కేమి, ఉన్నత పాఠశాలా విద్యార్థులకేమి పఠనీయముగా నియమించి పాఠ్యగ్రంథ నిర్ణాయక సమితివారు తోడ్పడుదురని యాకాంక్షించు చున్నాండ.

మునిసిపల్ హైస్కూలు
కడప,
విజయ, దీపావళి

భవదీయ శ్రేయోభిలాషి, కావ్యపురాణతీర్థ,
విద్వాన్
జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ,
సీనియర్ తెలుంగు పండితులు.

ఈ గ్రంథమును సంపూర్ణముగ చదివితిని. హృద యాకర్షముగ నున్నది. మరియు భీభత్సమగు ప్రాణి హింసా నివారణమున కీ గ్రంథము మిక్కిలి యుపయోగపడ కలదు. ప్రకృతము మన ఆంధ్రరాష్ట్రమున కిది మిక్కిలి యావశ్యక మైనదని చెప్పక తప్పదు. ఇంక భాష, శబ్దసౌష్టవము, పద లాలిత్యము, రచన భావస్ఫోరణము మొదలగు విషయము లను గూర్చి వ్రాయుట పిష్టపేషణ మగును. గ్రంథమే ముందున్నది గదా.

ఇట్టి గ్రంథములను బాలురకు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించి విద్యాధికారులు మహాత్ముని మూలసూత్రమగు అహింసా ప్రచారమును సర్వతోముఖముగా సాగించు చక్కని దైవసేవయు, దేశసేవయుచేసి కృతార్థులగుదురు గాక.

బద్వేలు
విజయ, దీపావళి

జంగా నృశింహశాస్త్రి,
("పీయూష పాత్ర" యని ప్రఖ్యాతి గాంచిన
"శ్రీ రఘువీర చరిత" కావ్యకర్తలు)

---

భారతీయ సంస్కృతికిని, వాఙ్మయ ప్రపంచమునకు నొక ప్రత్యేకతను జేకూర్చిన మహర్షి శ్రీ రవీంద్రనాథ ఠాగూరు. అతని భాష సున్నితమయ్యు నెంత సునిశితమైనదో భారత సంస్కృతి కతం డంతగా మెఱుఁగుఁ బెట్టినాఁడు. అతని రచన లంత సులభముగా నర్థమగునవి కావు- అతని వేదాం తము దైవ మానుషముల మధ్య నొక పోరాటము కావున-

ఏదో అర్థము జేసికొన్నామన్నచో నతని భావ మదే రీతిని చెప్పుట కష్టము. భావార్థములు చెడకుండ ఠాగూరు రచనల భాషాంతరీకరణ మొనర్చుటంతకన్నఁ గష్టము. ఠాగూరు రచనలఁ దెలుఁగులో ననువదింపఁ బూనుకొనినవారిలో నే నొకఁడను గనుక యందలి కష్టము తెలిసినది. ఈ యనువాదకులు, శ్రీ యస్. బ్రహ్మయ్యగారు, నాకు 1941 వ సంవత్సరము నుండియు మిత్రులు. మదనపురీ కళాశాలలో వారు బి.ఏ. తరగతిలోను, నేను ఇంటర్మీడియేటు తరగతిలోను జదువు చున్నప్పుడు, వారికి పాఠ్యగ్రంథముగా నున్న యీ నాటక ములఁ గూర్చి యెన్నియోసార్లు మాలో మేము దీర్ఘ చర్చలు జరిపినాము. వారు తను ముప్పదవయేటనే ఈ కష్టతర కార్య మును సాధించి తమ ఆశయమును నెరవేర్చికొని సఫలీకృతు లైనారు. మూల గ్రంథములోని భావము, శైలి, సన్నివేశోచిత శబ్ద ప్రయోగాది లక్షణములు చెడకుండ తెలుఁగున ననువ దించి యాంధ్రభాష కపార సేవఁ జేసినారు.

అనువాదకుల యీ భాషాంతరీకరణమును విద్యార్థులకుఁ బఠనీయ గ్రంథముగఁ జేసిన వారికిఁ దగిన ప్రోత్సాహము కలుగుననియు, నీ యనువాదము సర్వ జనాదరణీయ మగు ననియు ఆశించుచున్నాను.

ఇ. వరదారెడ్డి, బి.ఏ.,బి.యల్.

(జుడిషియల్ రెండవ తరగతి మేజిస్ట్రేటుగారు, బి.ఏ., తెలుగులో మద్రాసు విశ్వవిద్యాలయ ప్రథమ బహుమానము నందినవారు.)

ప్రియ మిత్రమా,

శ్రీ రవీంద్రనాథ ఠాకూరుగారు రచించిన "బలి", "రాజు - రాణి" అను సుప్రసిద్ధ నాటికలకు మీరు గావించిన ఆంధ్రానువాదమును జదువుటకు నాకు అమితానందము గలిగినది. మీ అనువాదము ద్వారా రవీంద్ర కవీంద్రుని ఆంధ్ర ప్రజలకు సన్నిహితునిగను, ప్రీతిపాత్రునిగను జేసితిరి.

మీ నాటికలకు బలి యను శీర్షిక ఎంతయు తగియున్నది. శ్రీ రవీంద్రుని రచనల అనువదించుట సాహసకార్యమేయైనను మీరీ నాటికల చక్కగా ననువదించి మూలమునకున్న గౌరవము గాపాడితిరి. ఇది సంతోషకరమైన విషయము. రవీంద్రుని రచనల ననువదించుటలో చాలమంది రచయితలు కృతకృత్యులు కాలేకపోయినను, మీరు మాత్రము చిన్నచిన్న పదములతో నూటిగా హృదయరంజకముగా నుండునట్లు తెనిగించి మూలము లోని భావమును చెడకుండ జేసితిరి.

నేనును ఒక నటకుఁడనగుటచే మీ నాటకములు ప్రకటనార్హముగ నున్నవనియు భాష, భావము లలితముగ నున్నవనియు చెప్పగలను. ఈ నాటికల పలుమారు ప్రదర్శించినచో చాల బాగుండును.

మీకు భగవంతుడు ఆయురారోగ్యములను చక్కని అవకాశములను ప్రసాదించు గాక.

బోర్డు హైస్కూల్,
సింహాద్రిపురము.

ప్రియ మిత్రుఁడు,
యమ్. వి. దొరస్వామి,
హెడ్ మాష్టరు.

# పరిచయము

'జగమెఱిఁగిన బాఁపనికి జందెమేల' యన్నట్లు విశ్వకవి రవీంద్రనాథ టాగూరునకు పరిచయ వాక్యము లనావసరము. అతని నెఱుఁగని వారఱుదు. ఐనను ఆయన వేదాంతమును, ఆయన సాగించిన సాధనాక్రమమును, వినిపించిన సందేశ సారాంశమును వివరించుట అవసరమని తోఁచక మానదు.

మానవ ధర్మమే శాశ్వత ధర్మమనీ, మానవత్వమే దైవత్వమనీ భావించుటయే ఆయన వేదాంతము. ఆ తత్త్వమునే ఆయన పాటలుగా, పదములుగా, నవలలుగా, నాటకములుగా, కథలుగా యావద్భారత దేశమునకేగాక లోకమునకంతటికీ చాటి వినిపించెను.

రవీంద్రుని వేదాంతమునకు, సామాన్య జనుల వేదాంతమునకు హస్తిమశకాంతర మున్నది. సాధారణముగా వేదాంతము పేరున జరుగు అంతులేని వాదములకు, అనాచారములకు ఆయన వేదాంతమున తావులేదు. మన వేదాంతము దేవుని చుట్టు సుడి తిరుగుచున్నది. దైవాన్వేషణము, మానవ నిర్వాణము ఇవే దాని ఆదర్శము. రవీంద్రుని వేదాంతము మానవుని చుట్టూ అల్లుకొని యున్నది. ధర్మ మానవ సృజనమే దాని ఆదర్శము.

సర్వానర్థదాయకమని సౌందర్య పరాఙ్ముఖులైన వేదాంతుల వైరాగ్యము నెడల విముఖత్వమునుఁ జూపి నిర్భయముగ వైరాగ్య సాధనలచే కలుగు మోక్షము తనకు వలదనెను. సౌందర్యార్చన ద్వారా స్వర్గధామమును జేరవచ్చు ననెను.

సౌందర్య పరాకాష్ఠనందిన తన కవితాజవ్వనికి అర్ధదైవత్వము నాపాదించి 'దేవి'ని చేసెను.

రవీంద్రుని దృష్టిలో మానవ ధర్మమొక దివ్య ధర్మము; శాశ్వత ధర్మము. "సృష్టికి మకుటాయమానము మానవుఁడు. మానవత్వమే దైవత్వము." ఈ ప్రాతిపదిక పైననే అతని ధర్మమూనవ స్వరూపము. ఎక్కడనో శూన్యములో దైవత్వము కొఱకు వెదుకఁడు. 'మానవత్వమే దైవత్వము, దైవత్వమే మానవత్వము' అని యాతఁడు భావించును. అదే ఆయన తత్వము, అదే ఆయన వేదాంతము.

రవీంద్రుఁడు కేవలము కావ్యసృష్టి చేసిన కవి గాఁడు; మానవుని దేవునిగా, దేవుని మానవునిగా పరివర్తనము చేసిన విశ్వకర్మ. పాశ్చాత్య నాగరకతా వ్యామోహమున స్వధర్మ భ్రష్టమగు మాతృదేశమున ప్రాక్తన దివ్యవిజ్ఞాన గంధమును వెదజల్లిన ఋషిపుంగవుఁడు. విశ్వ విపంచిని మ్రోయించి, విశ్వ కల్యాణ గీతముల నాలపించి రసజగత్తును తన్మయపఱచిన మధురమూర్తి.

రవీంద్రుఁడు మానవ సౌభాగ్యవాది. మానవ సమాజ మందున్న దోషములను, బాధను ఏవిధముగా తొలగింపవలెనా యను సమస్య సభ్య ప్రపంచమును నేడు పీడించుచున్నది. అందులకై అనేక ప్రయత్నములు చేయబడుచున్నవి. అనేక ప్రణాళికలు తయారగుచున్నవి. సమావేశములు, సంధులు జరుగుచున్నవి. కాని, ఏనాఁడో యీ సమస్య రవీంద్రుని

పీడించినది. ఆయన ఆ సమస్యా పరిష్కారమును ఆనాడే సూచించెను. నేడు సమాజమును పట్టి పీడించుచున్న దుష్ట శక్తులకు సంకుచితత్వము, స్వార్థపరత్వము మూలకారణములని విశదీకరించెను.

రవీంద్రుని జీవిత చరిత్ర తెలియని వారుండరు. ఆయన జీవితములో ముఖ్య ఘటన లివి. 1861 మే 6 వ తేదీన కలకత్తాలో నొక ప్రఖ్యాత ధనిక బ్రాహ్మణ కుటుంబములో జన్మించెను. సంఘ సంస్కర్తలకు, కళాకారులకు, వేదాంతులకు అతని వంశము పుట్టిల్లు. తండ్రి మహర్షి దేవేంద్రనాథ టాగూరు; తల్లి శ్రీ శారదాదేవి.

1877 లో రవీంద్రుఁడు ఇంగ్లాండు దేశమునకుఁ బోయి లండను విశ్వవిద్యాలయమున కొన్నాళ్లు చదివెను. కాని, యా చదువులాతని హృదయము నాకర్షింపలేదు. అతడంతట స్వదేశమునకు తిరిగి వచ్చెను.

1883 డిశంబరులో మృణాలినీదేవిని వివాహమాడెను. వివాహానంతరము తన ఇరువదిమూడవ యేట ఎస్టేటు వ్యవహారములఁ జూచుకొనుటకై 'షిలైదా' గ్రామమునకు వెళ్లెను. అచ్చటనే ఆయన తన తొలి రచనల పూర్తి చేసెను.

1901 డిసెంబరులో టాగూరు శాంతినికేతన మను విశ్వ విఖ్యాతి గాంచిన విద్యాలయమును స్థాపించెను. దాని యభివృద్ధికై తుదివఱకు పాటుపడెను. శాంతినికేతనములో శ్రీనికేత మను పారిశ్రామిక విద్యాకేంద్రమును స్వయముగా నెలకొల్పెను.

రవీంద్రుని రచనలలో "గీతాంజలి" సుప్రసిద్ధమైనది. విశ్వ సాహిత్యమున అగ్రగణ్యముగ గణింపఁబడుటచే 1913 నవంబరులో లక్షా యిరువదివేల రూప్యములు స్వీడిష్ నోబెల్ బహుమానము పొందెను. ఆ ధనముకూడ ఆయన శాంతి నికేతన విద్యాలయాభివృద్ధికే వినియోగించెను.

విద్యారంగములో రవీంద్రుడు చేసిన సేవ అమూల్యము. 1921 డిశంబరులో 'విశ్వభారతి'ని స్థాపించెను. ఈ 'విశ్వ భారతి' అంతర్జాతీయ విఖ్యాతి గాంచిన వైజ్ఞానిక, సాంస్కృతిక విద్యాసంస్థ. అది ప్రాక్పశ్చిమ సంస్కృతీ సంప్రదాయముల సమన్వయ కేంద్రము.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ మారంభమై, యుద్ధదేవత నరబలికై నాలుక చాచి విలయ శక్తులతో విజృంభించిన సమయములో, లోకమున నైతిక ప్రమాణములు నశించి వాటి పునరుద్ధరణకై ఆ మహాపురుషుని మార్గదర్శకత్వము, శాంతి సందేశము అత్యంత అవసరమైన క్లిష్ట సమయములో 1941 ఆగస్టు 7 వ తేదీన శ్రీ రవీంద్రనాథ టాగూరు దివంగతుఁడయ్యెను.

రవీంద్రుని జీవితమునకు సంబంధించిన వివరము లెన్ని తెలిసియున్నను, ఆయన వ్యక్తిత్వమును అర్థము చేసికొన వలయునన్న ముఖ్యముగా అతని రచనల పరిశీలింపవలసి యున్నది.

ప్రాచీ ప్రతీచీ నాగరకతా ప్రపంచములలో కోట్లకొలది ప్రజలు రవీంద్రుని రచనల చదివిరి, ఆనందించిరి. తన జీవితకాలమందే రవీంద్రునిపై పాశ్చాత్యులు గ్రుమ్మరించి నంత గౌరవ ప్రతిపత్తు లింకే తూర్పుఖండ కవిపైగాని గ్రుమ్మరించి యుండలేదు. 1913 లో రవీంద్రుని 'గీతాంజలి' నోబెల్ బహుమాన మందుకొనెను. ఇది పదమూడు ఐరోపీయ భాషల లోని కనువదింపఁబడెను. ఇరువదవ శతాబ్దములో మహామేధావియగు కవి ప్రపంచ విజయము మనల నాశ్చర్యపూరితులఁ జేయగలదు. ఆంగ్ల కవి బైరను కాలమునుండి లక్షలాది చదువరుల మెప్పునంది, వారిచే పూజింపబడిన కవి పుంగవుఁ డింకొకఁడు లేడు. పశ్చిమఖండ వాసులకు అపరిచితుడైన రవీంద్రుఁడు పాశ్చాత్య కవులను సైతము- తాత్కాలికముగానైన నేమి- తన కీర్తిప్రసక్తులచే మఱుగుపఱచి కొన్ని యేండ్ల కాలము ఐరోపా ఖండమంతటిని యేకచ్ఛత్రాధిపతిగా నేలినాడన్న యిది సంభవమా అన్న సందియము పొడసూపకపోదు. అందుచేతనే కాబోలు రవీంద్రుఁడే యిట్లనినాఁడు : "నాకున్న కీర్తిని నే నొక గొప్పగా భావించను. అది తక్షణమే లభించినది."

రవీంద్రుఁడు వనమాలి, చంద్రవంక, కచదేవయాని, చిత్రాంగద, పోష్టాఫీసు, సాధన, భగ్న బంధములు, ఫల సేకరణ, బలి, జాతీయత, మాషీ, ఇంటా-బయటా, గోరా, నౌకా భంగము, ముక్తధార, చదరంగము మొదలైన అనేక

గ్రంథముల రచించెను. ఆయన రచించిన 'జనగణమన' భారత దేశ జాతీయగీత మైనది. టాగూరు తన పద్యకావ్యముల వంగ భాషలో రచించెను. వాటిలో ననేక కావ్యముల స్వయముగా ఆంగ్లీకరించెను. పద లాలిత్యమునకు, భావ గాంభీర్యమునకు, రస స్ఫురణకు, ఉత్తమ ఆశయములకు ఆయన కవిత పెట్టినది పేరు.

టాగూరు రసగ్రహణ పారీణుడు. సౌందర్యార్చన ద్వారా మర్త్యుని అమర్త్యునిగా పరివర్తనము చేయఁ జూచిన కళాస్రష్ట. ప్రకృతి పుటల విప్పి దాని యనంత రూపముల హృదయరంజకముగఁ జిత్రించెను. ప్రకృతి సౌందర్యమును సమగ్రముగ నాకళించుకొని వర్ణించెను. అతని కవితలో ప్రకృతి రహస్యభేదనము ఇమిడి యున్నది. తెల్లని పొగతో గప్పఁబడిన పర్వత శిఖరములును, బంగారు రంగులతో తళ తళలాడు పచ్చని పైరులును, ధారాళ నదీ ప్రవాహములును, దట్టపు టడవులును నూతన సౌందర్యము నాతనిలో రేకెత్తించెను. నిరాడంబరమైన పల్లెటూరి జీవిత మాతనికి బాగుగా నచ్చెను. తల్లుల జోలపాటలును, బాలబాలికల ఆటపాటలును, అమాయికలగు గొల్లపడుచుల ప్రేమ గీతములును అతనికి హాయి గొల్పెను. అకృత్రిమమైన కృషీవలుల జీవన విధానము లను, అందమైన ప్రకృతి దృశ్యములను, నీలాకాశమును, మేఘమాలికలను గురించి ఆయన చేసిన వర్ణనలు కడు మనోహరములు.

రవీంద్రుని కథలు, నవలలు చదివి యానందించనివా రరుదు. ఆయన కథలలో సున్నితమైన హాస్యరసము, సౌకుమార్యము కనుపించును. మానవ ప్రవృత్తిని ఆయన ఎంత చక్కగ అర్థము చేసుకొనినది ఆయన కథలవల్ల తెలియగలదు. కాబూలీవాలాను తన సునిశిత వర్ణనతో మన మనోనేత్రముల ఎదుట ప్రత్యక్షము చేసి మఱువకుండఁ జేసెను. 'పఠేకు'ని వర్ణన పిల్లల చిత్తవృత్తి నెంత చక్కగా చిత్రించెనో తెలుపును. ఒక్కటేమిటి రవీంద్రుఁడు రచించిన కథ లన్నిటిలోను ఆయన మానవత్వము, ఆర్ద్ర హృదయము ప్రస్ఫుటమగును. ఈ కథలన్నియు గంభీరోదార భావములను ప్రకటించును.

టాగూరు తన ఆదర్శములను నవలల ద్వారా ఉపదేశించెను. భారతీయ సామాజిక వ్యవస్థలో గల దారుణమైన దోషముల తన రచనలతో ఖండించి సంఘ సంస్కర్తలకు మార్గదర్శి యాయెను. నవలలో ఆయన సృష్టించిన పాత్రలు చదువరుల ఎదుట సాక్షాత్కరించినట్లుండును. మత విమర్శతో గూడిన 'గోరా', గాఢ ప్రేమానుభూతులతో నిండిన 'నౌకాభంగము', సంఘ సంస్కారమను బురఖా వెనుక సంసారముల గూల్చు కుత్సితుల బ్రతుకుల బయటపెట్టు 'ఇంటా–బయటా' ప్రతి యొకరు చదువతగినవి.

## పీఠిక

"బలి" రవీంద్రుని రసవత్తరమగు నాటికలలో నొకటి. రవీంద్రుఁడు దీనికి వంగ భాషలో 'విసర్జన' అని నామకరణము

జేసెను. ఇతర దేశీయ భాషలలోనికే గాక అయిదారు ఐరోపీయ భాషలలోనికి గూడ 'బలి' అనువదింపఁబడెను. ఆంగ్ల భాషలోని కనువదింపబడి 1917 లో మొదట ముద్రింప బడినది. ఈ నాటికలో నతి ముఖ్యమైన రఘుపతి, జయసింహుల పాత్రల రవీంద్రుఁడు స్వయముగ నిర్వహించెను.

'బలి'లోని విషయము మహాకవి తొలుత 'రాజర్షి' యను నవలగా వ్రాసి యావలఁ గొన్నియేండ్లకు దృశ్యముగాఁ దీర్చి దిద్దెను. 'రాజర్షి' యందలి యితివృత్తము చరిత్రాత్మకము. కథాకాలము షాజహాను చక్రవర్తి ప్రభుత్వము నాటిది. ప్రజా సామాన్యమునకు నాటక ప్రయోగము మిక్కిలి నీతి ప్రదాయక మనియు, ప్రశాంతి ప్రదమనియు; శ్రవ్య కావ్యములయందు మనోనయన గోచరములు మాత్రమే కాఁదగు ప్రఖ్యాత పాత్రలను దృశ్య కావ్యములందుఁ గన్నారఁ గాంచి యానందింపఁ దగియుండుటయే 'కావ్యేషు నాటకం రమ్య'మ్మను నానుడికి కారణమనియు ఎఱిఁగి యుండుటచే కాఁబోలు రవీంద్రుఁ డిందలి కథావస్తువును దృశ్య కావ్యముగాఁ దీర్చిదిద్దెను.

ఈ నాటకమునందు అంక, రంగ విభాగములు లేవు. ఇది ఏకాంకిక. రంగము కూడ ఒక్కటే—త్రిపురలో గోమతీ నదీ తీరమునఁగల భువనేశ్వరీ దేవాలయము. భువనేశ్వరీ పూజ పదునాలుగు దినములు జరిగిన పిమ్మట పదునైదవ రేయి చతుర్దశ దేవతల కేకాంతపూజ జరుగుట పరిపాటి. ఆ పూజా రాత్రమున నరబలి జరుగునని ప్రతీతి.

"ధర్మమున కాధారమైనది దాక్షిణ్యము."

"ధర్మములలో కెల్ల ఉత్తమ ధర్మము-అహింస" అను ఆర్యోక్తుల ఈ నాటిక పునరుద్ఘాటించును. "ప్రాణికోటి రక్తము దేవతల కొసంగవలసిన బలికాదు. భక్తి ప్రేమలు రక్త లేపనముచే కలుషితములు గారాదు" అని నిరూపించును. అర్థవిహీనమగు ఆచారకాండతో ఉక్కిరి బిక్కిరగు చుండిన హిందూ సంఘమును సంస్కరించుటకై రవీంద్రుడీనాటకమును రచించెను. దేవతలను ప్రసన్నులను గావించుకొను కొఱకు గావించు క్రతుకర్మాదికముల ప్రయోజనమును, తత్కార్యదీక్షా పరతంత్రులయిన బ్రాహ్మణుల ప్రవర్తనాధిక్యములను తీవ్రముగ విమర్శించెను. అనాదిగా హిందూ మతమున పాదుకొనిపోయిన పశుబల్యాది దురాచారములను, మూఢవిశ్వాసములను ఖండించి వైచెను. దేవతా ప్రసన్నతకు మూఢులనుసరించు హింసా మార్గమును నిర్మూలించి, ప్రేమ పూరితమగు పూలబాటను నిర్మించెను.

ప్రేమకును, పరంపరాగతమగు ఆచారమునకును సంఘటిల్లిన సంఘర్షణ మిందు వర్ణింపబడినది. పూర్వాచార పరాయణులై ఒక పక్షమువారు ప్రాణి హత్యకు పూనుకొనిరి. ప్రాణి విలువ ఎంత అధికమో, ప్రాణిపై ప్రాణికిగల మమకార మెంత ప్రగాఢమో తెలిసికొన్న వేరొక పక్షమువారు ప్రాణిహత్య నాపుటకై పాటుపడిరి. అందుచే యిరు పక్షములకు విరోధము కలిగెను. ఒక వర్గమున రఘుపతి, నక్షత్రకుఁడు, గుణవతి, ఇంకొక వర్గమున గోవిందుఁడు, జయసింహుఁడు,

అపర్ణ చేరిరి. రఘుపతి సనాతన సంప్రదాయమును, రాజు ప్రేమను ప్రతిష్ఠింపఁ బూనిరి. జయసింహుని ఆత్మార్పణము వలన రఘుపతికి జ్ఞానోదయమాయెను. అప్పుడే యాతఁడు ప్రేమ హింసామార్గమున బోదనియు, జనని పూజ బలులచే గాక ప్రేమచే సాధ్యమగుననియు గ్రహింపగలిగెను. తుదకు ప్రేమకే జయము కలిగెను.

## విన్నపము

నేను మదనపురి దివ్యజ్ఞాన కళాశాలలో బి. ఏ. పఠించుచుండిన కాలమున 'బలి', "Sacrifice and other plays", మాకు పాఠ్యగ్రంథముగా నుండినది. ఆంధ్ర విద్యార్థులు రవీంద్ర కవీంద్రుని నాటక సంవిధానమును, భావనా బలమును, ఉపదేశ సారమును జక్కఁగ గ్రహించి తనియుటకు మాతృభాషయే ప్రధాన సాధనమని తలచి ఈ నాటకము నాంధ్రీకరింప నా కానాడే కోరిక జనించెను. నాడు జన్మించిన కోరిక ఆంధ్ర రాష్ట్రావతరణ శుభ దినము నాటికి సిద్ధి చెందినది.

గంభీర భావగర్భితములగు రవీంద్రుని రచనల ననువదించుటకుఁ జేయెత్తుట సాహసమే యైనను, అతని కవితా మాధుర్యమును లవమైనను ఎటులైన సోదరాంధ్రులకుఁ జవి జూపవలెనన్న కుతూహలమే నన్నీ పనికి పురిగొల్పినది. రవీంద్రుని శక్తి యపారమైనది, యసాధారణమైనది. అతని భాషా

శైలి ప్రత్యేకమైనది; స్వతంత్రమైనది; అర్థబంధముల నతిక్ర మించినది పదములు చిన్నవైనను విశాల భావగర్భితములై యుండును. పదాడంబరమునకన్న భావ వ్యక్తియే ప్రధానముగ నుండును. గద్యమైనను, పద్యమైనను రసాత్మకమై వెలయుచు యుండును. ఇట్టి విశిష్టమైన భాషానువాద మత్యంత కష్టమైన దని విజ్ఞు లంగీకరించియే యున్నారు. "The translation of writings so steeped in vivid imagery as those of Rabindranath Tagore is a fascinating and delightful task, but a very baffling one"అని, "సైక్సు" యభిప్రాయము. "అనువాదకుఁ డెంత యసామాన్య ప్రజ్ఞ కలవాడైనను ననువాదము గుణమునందును, నర్థ సౌలభ్యము నందును, రస స్ఫురణయందును మూలము నంత పటువుగా నుండుట దుర్లభము" అని మఱియొకరి యభిప్రాయము. ఆంధ్ర వాఙ్మయమే (కావ్యాకృతిలో) అనువాదములతో ఆరంభమై నప్పటికిని యనువాద రచన మెంత కష్టమో తెలియుచున్నది. అందునను, రవీంద్రునివంటి నిరంకుశ మహాకవి కవిత కనువాదము దుస్సాధ్య మనిపించును. ఇది గ్రహించిన పెద్దలు, సహృదయు లగు చదువరులు ఇందెన్ని లోపములున్నను నన్ను మన్నింతు రని విశ్వసించుచున్నాను.

ఈ నాటకముల ననువదించుట కనుమతించిన మ్యాక్మిలన్ అండ్ కంపెనీ (M/s Macmillan & co., London)

వారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. ఈ నాటకముల ప్రచురింప ప్రోత్స హించి, సర్వవిధముల సహాయము చేసిన మిత్రులు, "మాతృ సేవ" సంపాదకులు అగు శ్రీ శ్రీధరరావు, B.Sc., A.M.I.E. గారికి నా కృతజ్ఞతాపూర్వక వందన శతమ్ములు. తొలుత ఈ పొత్తము నచ్చొత్తించి, ప్రచురించుటకై సహాయ మొనర్చిన మిత్రుఁడు డాక్టర్ ఐ. యల్. నరసయ్య, B. Sc. M.B.B.S., D.P.H. (జిల్లా ఆరోగ్యశాఖాధికారి) గారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. అడిగినంతనే తమ అమూల్యాభిప్రాయముల నొసంగి నన్ను ప్రోత్సహించిన నా గురువులకు, మిత్రులకు, పత్రికాధిపతులకు నా కృతజ్ఞతాపూర్వక వందన సహస్ర ములు. ఈ గ్రంథ పునర్ముద్రణమునకు ప్రోత్సహించి, యే తత్కార్యమున నన్ను కృతకృత్యుని గావించిన నా ప్రియ మిత్రులు శ్రీ డాక్టర్ ఐ. ఎల్. నరసయ్యగారికిని, శ్రీ జి. పుల్లన్న గారికిని. ముద్రణాలయాధికారులకును గృతజ్ఞతాపూర్వక నమస్కారముల నర్పించుచున్నాఁడను.

విజయ దశమి,
19-10-'61.

యన్. బ్రహ్మయ్య.

# బలి

## నాటకము నందలి పాత్రలు

---

పురుషులు

1. గోవిందమాణిక్యరాయలు – 'త్రిపుర' రాజు
2. నక్షత్రరాయలు – రాజసోదరుఁడు, యువరాజు
3. రఘుపతి – రాజపురోహితుఁడు, కాళికాలయ పూజారి
4. జయసింహుఁడు – కాళికాలయ పరిచారకుఁడు, రఘుపతికిఁ బ్రియశిష్యుఁడు
5. నయనరాయలు – సేనాధిపతి
6. చండపాలుఁడు – ఉపసేనాధిపతి
7. మంత్రి
8. ధ్రువుఁడు – రాజు పెంపుడు కొమారుఁడు

స్త్రీలు

1. గుణవతి – రాణి
2. అపర్ణ – భిక్షుక బాలిక

---

# బలి

---

స్థలము : త్రిపురలో కాళికాలయము.

సమయము : ప్రాతఃకాలము.

( గుణవతి ప్రవేశించి దేవీ విగ్రహముముందు మోకరిల్లి )

గుణవతి : ఓ భీకర కాళికేశ్వరీ! హే జగజ్జననీ ! నాపై నీకింత ఆగ్రహమేల ? పొట్టకూటికై బిడ్డలనమ్ముకొను భిక్షుకు రాండ్రకు, అపకీర్తికి వెఱచి కన్నబిడ్డల జంపు కులటలకు కూడ సంతానము ననుగ్రహింతువే, మఱి యీ సమస్త భూవలయ మునకు మహారాణినైన నాకొక్క పసికూనను ప్రసాదింప కూడదా? నేను నీకేమి యపచారము చేసితిని? అంతటి స్త్రీల వలె నేనును ఒక్క చక్కని శిశువును గని అక్కున జేర్చుకొని చెక్కిలి ముద్దాడ నోచుకొనలేదా ? స్వర్గతుల్యమగు ఆ మాతృస్థానమునుండి పతనమగుటకు నేనేమి పాపముచేసితిని ? సంతానములేనిది ఎంత మహారాణినైన ఏమి ప్రయోజనము? సుతులులేనివారికి గతులు లేవందురు. కనికరించి నాకొక్క వంశాంకురము నిమ్ము. నీకు మూడువందల మేకపోతులను, వంద ఎనుబోతులను బలి యిచ్చెదను.

(రఘుపతి ప్రవేశించును)

స్వామీ, నే నెప్పుడైన దేవీపూజలో నశ్రద్ధచేసితినా? నా పతి వీతిహోత్రునివలె అతిపవిత్రుఁడు కాఁడా? ఐనచో ఈ

మాయా ప్రపంచ జాలమునల్లు దేవి నాకీ యనపత్యతాదోష మంటగట్టనేల ?

రఘుపతి: అంబ లీలల గోచరములు. మన సుఖదుఃఖము లామె మనోవిలాసములు. తనయా, ఓపిక పట్టుము, చండిని సంతోషపఱచుటకై ఈ దినము నీ పేర ప్రత్యేక బలి సమర్పింతము.

గుణవతి: తండ్రీ, నీకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. నా నివేదనలు — ఎట్టివి గన్నేరు పూదండలు, బలి పశువులు—ఈసరికి దేవ్యాలయమునకు వచ్చుచుండును. (వారు బయటికిఁ బోయెదరు.)

(గోవింద మాణిక్యరాయలు, జయసింహుఁడు, అపర్ణ ప్రవేశింతురు.)

జయసింహుఁడు: ప్రభూ, ఆజ్ఞ యేమి ?

గోవిందుఁడు: ఈ పేదబాలిక పెంపుడు మేకను వధించుటకై ఈ దేవ్యాలయమునకు బలవంతముగఁ దీసికొని వచ్చిరట నిజమేనా ? అట్టి కానుకను మాత ప్రీతితో స్వీకరించునా ?

జయసింహుఁడు: దేవా ! మా కైనందిన పూజా నివేదనల నాలయ సేవకు లెచ్చుటనుండి సేకరించి తెచ్చెదరో మాకెట్లు తెలియును ? బాలా, ఎందుకేడ్చెదవు? తల్లి స్వయముగాఁ దీసికొన్న దానికై కన్నీరు కార్చదగునా ?

అపర్ణ: ఎవరా తల్లి? నేను దానికి తల్లిని. నేను గుడిసెకు రా నాలసించినచో అది గడ్డికుడువక అట్టు జాచి యఱ

చుచు దారివెంబడి నారాక కెదురు చూచుచుండును. నేను వచ్చి దానిని చంకనిడుకొని నాతోపాటు దానికాహారము తిని పింతును. నన్ను తప్ప యింకే తల్లిని యెఱుఁగదు.

జయసింహుఁడు: ప్రభూ, నా ప్రాణములలో కొంత పాలిచ్చి యీ మేకపిల్లను బ్రతికింపఁ గలిగినచో, సంతోష ముతో నట్లుచేసెదను. కాని 'తల్లి' స్వయముగాఁ దీసికొన్న దానిని నేనెట్లు తేఁగలను ?

అపర్ణ: తల్లి తీసికొన్నదా? కల్ల, తల్లికాదు, పిశాచిని.

జయ: ఆ, ఆ, దైవదూషణ! మహాపచారము!!

అపర్ణ: తల్లీ, ఈ పేద బాలిక ప్రేమను దోఁచుకొను టకా నీ విటనున్నది? అటులయిన నీ నేరముల విచారించి శిక్షించువా రెవ్వరు ? సెలవిండు మహారాజా.

గోవిందుఁడు: బిడ్డా, నేనేమియు బదులాడ జాల కున్నాను.

అపర్ణ: మందిర సోపానములపై నుండి క్రిందికి ప్రవ హించు నీ రక్తధార దానిదేనా ? అయ్యో! బిడ్డా! కఱకు రక్కసుల కత్తికోతలకు కంపించి అఱచినప్పుడా నీ పిలుపు యీ సువిశాల బధిర ప్రపంచమున నా చెవి చేరదాయెనే.

జయ: (ప్రతిమతో) కాళీమాతా, నా బాల్యము నుండియు సేవించుచున్నను నిన్ను దెలిసికొన లేకున్నాను. లోక మాతవే, నీకు దయలేదా? జాలి యనునది దుర్బలులగు మాన వులకు మాత్రమేనా, దేవతలకు లేదా ? అమ్మాయీ, నా

వెంట రమ్ము. నాచేతనైన మేలుఁ జేసెదను. దైవము సాయముఁ జేయ నిరాకరించినప్పుడు, మానవుఁడు చేయవలసినదే కదా!

(జయసింహుఁడు, అపర్ణ బయటికిఁ బోయెదరు)

(రఘుపతి, నక్షత్రరాయలు, రాజోద్యోగులు ప్రవేశింతురు)

అందఱు: మహారాజునకు జయమగు గాక!

గోవిందుఁడు: నేటినుండి దేవ్యాలయమున జీవ బలి నిషేధించుచున్నాను.

మంత్రి: దేవికి బలి నిషేధించుచున్నారా?

నయనరాయలు: బలి నిషేధమా?

నక్షత్రకుఁడు: బలి నిషేధమా? ఎంత దారుణము!

రఘుపతి: ఇది కలకాదు కదా?

గోవిందుఁడు: కలకాదు, గురుదేవా, జ్ఞానోదయము. జనని బాలికా రూపమునవచ్చి తనకు రక్తోపహార మసహ్యమని చెప్పినది.

రఘుపతి: తరతరములనుండి దేవి రుధిరపానము చేయుచునే యున్నది. ఇంత యాకస్మికముగా నీ యసహ్య మెట్లు కల్గినది?

గోవిందుఁడు: లేదు. ఆమె రుధిరపాన మెన్నడును చేయ లేదు. దానికామె పెడమొగము పెట్టినది.

రఘుపతి: చక్కఁగా నాలోచింపుఁడు. మీరు రాజులే యైనను పూజా విధానమును శాసింప లేరు. అది మీకు అపరిచితము. శాస్త్రవిధులు తమ యధీనములు గావు. వేద ధర్మముల మార్చుటకు మీ కధికారము లేదు.

గోవిందుఁడు: దేవి మాటలు సకల ధర్మాతీతములు.

రఘుపతి: ఓహో! దేవి మాటల విన్నది నీవేనా? నే వినలేదా?

నక్షత్రకుఁడు: ఔనౌను. దేవి మాటలు రాజు విని పూజారి వినలేదనుట చిత్రముగ నున్నది!

గోవిందుఁడు: దేవి మాటలు లోకములో సర్వదా ధ్వనించుచునే యున్నవి. చెవిటివారికా మాటలు వినరావు.

రఘుపతి: నాస్తికుఁడా! స్వమతద్రోహీ!!

గోవిందుఁడు: ఆర్యా, వ్యర్థముగఁ బ్రొద్దు పుచ్చక ప్రాతఃకాల పూజకుఁ బొండు. నా రాజ్యమున నిటుపై సకల చరాచర సృష్టికి జననియగు దేవీ పూజా చ్ఛలనమున ఎవరు జీవబలి చేసెదరో వారిని దేశభ్రష్టుల గావింతునని పోయి భక్తులందఱకు బ్రకటింపుఁడు.

రఘుపతి: ఇదే తుది నిర్ణయమా?

గోవిందుఁడు: ఔను.

రఘుపతి: ఐనచో నీ రాజ్యము నశించు గాక! అధికార గర్వమున కన్నుగానక, నీ రాజ్యములో నుండు ఈ దేవి నీ పాలిత యనుకొంటివా? నీ శాసనములచే నామెను బంధించి, యామెకుఁ జెల్లవలసిన కానుకల దోచుకొన జూచెదవా? దేవీ భక్తుడగు నీ రఘుపతి బొందెలో ప్రాణము లున్నంతవఱకు అట్లు జరుగదు. జరుగనీయఁడు. (పోవును)

నయనరాయలు : ప్రభూ, యీ సేవకుని సాహసమును క్షమింపుడు; బలి నిషేధింప మీ కధికారమున్నదా ?

మంత్రి : దేవా, మీయుత్తరువు రద్దుచేయుటకు కాలము మించిపోలేదు కదా ?

గోవిందుఁడు : పాపమును పరిమార్చుటకు ఆలసింప రాదు.

మంత్రి : పాపమున కింత పరమాయు వుండదు. దేవి చరణములకడ ప్రాతగిలిన ఈ యాచారములు పాప పంకిల ములై యుండవు.

(రాజు మౌనముగా నుండును.)

నక్షత్రకుఁడు : అది నిజమే.

మంత్రి : మన పితరు లీ యాచారముల నతి భక్తిశ్రద్ధ లతో నాచరించిరి. ఈ సనాతన సంప్రదాయమున కింతదనుక భంగము వాటిల్లలేదు. నేఁటి కిట్లగుట ఊర్ధ్వలోకమున పిత రుల యతృప్తికి కారణమగును. అంతియేగాదు; బలి నిషేధిం చుట వారి నవమానించుటకూడ.

(రాజు యోచించుచుండును.)

నయనరాయలు : యుగయుగాదిగా సాగుచున్న ఈ బలిదానము నాపివేయుటకు రాజున కధికార మెక్కడిది ?

గోవిందుఁడు : ఈ సందేహములు, వాదములు ఇక చాలింపుఁడు. పోయి రాజ్యమందంతటను నా యాజ్ఞను ప్రవ ర్తింపఁ జేయుఁడు.

మంత్రి : ఒక్కమనవి ప్రభూ! మహారాణిగారు నేటి ప్రాతఃకాలపూజకై వేఁటల సమర్పింపనున్నారు, ఆలయద్వార సమీపమున కవి యఱుదెంచియున్నవి.

గోవిందుఁడు: వేఁటల త్రిప్పివేయుఁడు. (రాజు పోవును.)

మంత్రి : ఆహా! మహారాజు మనసు మాఱిపోయినది.

నక్షత్రకుఁడు : ఐన మన మిక బౌద్ధులవలె జీవజంతువుల గౌరవింపవలసినదేనా ? ఎంత విపరీతము!

(అందఱు నిష్క్రమింతురు.)

---

(రఘుపతి, జలకలశముతో, చలువబట్టలతో జయసింహుఁడు ప్రవేశింతురు.)

జయసింహుఁడు : తండ్రీ! కాళ్ళకు నీళ్ళు తెచ్చితిని.

రఘుపతి: (కోపముతో) పో పొమ్ము, అవసరములేదు! (అని జలకలశమును దలక్రిందులు గావించును.)

జయ : ఇవిగో మీ ఉడుపులు. ధరింపుఁడు.

రఘుపతి : అక్కఱలేదు. (వస్త్రములను దూరముగఁ బాఱవేయును.)

(జయసింహుఁడు బట్టల నెత్తఁబోవును.)

రఘుపతి : (గట్టిగా) ఆఁగుము. అవి అటనే పడియుండ నిమ్ము.

జయ : (పనిపూర్తిచేసి మఱల జలము గొని వచ్చి గురుచరణములఁ గడిగి సవినయముగ) తండ్రీ! నా యపరాధ మేమి ?

రఘుపతి : ఆ మాట ఎవరనిరి ?

జయ : మఱి మీ కోపమునకు కారణము ?

రఘుపతి: (బోనులో సింగమువలె నటునిటుc దిరుగుచు) నన్నొంటరిగ నుండనిమ్ము. కీడునీడలు దట్టమైనవి. రాజాధికారము హద్దుమీఱి దేవాలయము నాక్రమించినది. అయ్యో! దేవతలారా, దాసానదాసులగు సకసుల్యలవలె రాజశాసనముల శిరసావహింప సిద్ధముగ నున్నారా ? మీ దేవరాజ్యములపై ఈ మానవ దురాక్రమణ మరి కట్టజాలరా ? కానిండు. దేవత లుదాసీనులైనను బ్రాహ్మణు లుపేక్షింపరు; వారి కోపాగ్నికి రాజసింహాసన మింధనమగుc గాక. కుమారా, నా చిత్తము క్షోభిల్లుచున్నది.

జయసింహుcడు : తండ్రీ! ఏమి జరిగినదో చెప్పుcడు.

రఘుపతి : చెప్పుటకు మాటలు చాలవు. తిరస్కరింపc బడిన యా త్రిపురేశ్వరినే యడుగుము.

జయ : తిరస్కారమా ? ఎవరిచేత ?

రఘుపతి : రాజు గోవిందునిచే.

జయ : రాజు గోవిందుcడు కాళీ మాతను దిరస్కరించెనా ?

రఘుపతి : నిన్ను, నన్ను, సకల శాస్త్ర విధులను, సర్వ దేశ కాల పాత్రములను దిరస్కరించెను. అనంత కాల ప్రవాహ మగు ఆదిశక్తిని సహితము అల్ప సింహాసనమున గూర్చుండి తిరస్కరించెను.

జయ : గోవిందప్రభువే!

రఘుపతి : అవునవును, మీ రాజు గోవిందుఁడే, కృతఘ్నుఁడా! నిన్ను పెంచి పెద్దవానిఁ జేయుటకై నా ప్రేమనంతయు ధారవోసినను, నాకన్న నీకు రాజు గోవిందుఁడే ప్రియతరుఁడైనవాఁడు. అతఁడు చెమటోడ్చినచోట నీవు నెత్తురోడ్చుటకు సంసిద్ధుఁడవై యుందువు.

జయ : పసిపాప తండ్రి యొడిలోఁ గూర్చుండి నిండు చందమామకై నింగికి చేతులఁ జాపును. నీవు నా తండ్రివి, రాజు గోవిందుఁడు నా పున్నమ చంద్రుఁడు.

రఘుపతి : ఔను. ఆ రాజచంద్రుఁడే రాజరాజేశ్వరికి ప్రాణి బలి నిషేధించెను.

జయ : మానవ బలి కూడనా?

రఘు : నీకు మతిబోయినదా యేమి? మానవుఁడు ప్రాణి కాఁడా?

జయ : ఐన నే విన్నదంతయు యదార్థమేనా?

రఘు : అబ్బా! మాటిమాటికి చెప్పి యేమి లాభము?

జయ : కాని యీ విషయమున మాత్రము మన మాతనికి విధేయులము కాఁజాలము.

రఘు : అవిధేయులకు దేశబహిష్కారము తప్పదు.

జయ : దేవీ పూజలేని దేశమునుండి బహిష్కరింపఁబడుట అనర్థము కాదు. నేను జీవించియున్నంతవఱకు ఆలయమున పూజ నిర్విఘ్నముగఁ జరుగవలసినదే.

(నిష్క్రమింతురు.)

(గుణవతి, పరిచారిక ప్రవేశింతురు.)

గుణవతి : ఏమంటివి ? మహారాణి పంపిన బలి నివేదనలు మందిర ద్వారమునుండి త్రిప్పి వేయబడినవా ? ఇట్టి కార్యమును చేయ సాహసించినవాని కెన్ని తలలే ? ఆ పాపమును దాపురించిన వాడెవఁడే ?

పరిచారిక : చెప్పుటకు భయముగ నున్నది.

గుణవతి : నే నడిగినప్పుడు చెప్పుటకు భయమెందుకే? నాకన్న ఎవరి కెక్కువ భయపడెదవు ?

పరిచారిక : మన్నించండి, మహారాణీ.

గుణవతి : ఇదియేమి కాలవిపరీతమే! నిన్న సాయంకాలమే వందిమాగధులు నా కీర్తిగానము చేసిరి; భూసురోత్తములు నన్నాశీర్వదించిరి; సేవకులు అడకువతో నా యాజ్ఞలఁ గొని చనిరి. ఇంతలో అంతయు తాఱుమాఱాయెనా? దేవికి పూజయు రాణికి అధికారమును చెల్లకుండఁ జేయుటకు ఏమి జరిగినది ? ఇది త్రిపురయేనా ! పూజారికి నా నమస్కారములని శీఘ్రముగ పిలుచుకొని రమ్ము, పొమ్ము. (పరిచారిక బయటికిఁ బోవును.)

(గోవిందుఁడు ప్రవేశించును.)

గుణవతి : నాథా ! ఇది వింటిరా ? త్రిపురేశ్వరి ఆలయమునుండి నా వేఁటలు తిరుగఁ గొట్టఁ బడినవఁట.

గోవిందుఁడు : నాకుఁ దెలియును.

గుణవతి : ఆఁ! మీకుఁ దెలియునా ? తెలిసియు ఈ యవమానమును సహించి యూరక యుంటిరా ?

గోవిందుఁడు : అపరాధిని క్షమింప వేఁడెదను.

గుణవతి : నాకుఁ దెలియును నాథా, మీది దయార్ద్ర హృదయము. కాని యిది దయ కాదు, దౌర్బల్యము. అప రాధుల దండింపకున్న దేశ మరాజకమగును. మీరు శిక్షింప లేకున్న, ఆ పని నాకు వదలుఁడు. అపరాధి యెవరో చెప్పుఁడు.

గోవిందుఁడు : నేనే! ప్రేయసీ! నిన్ను నొప్పించుటే నా నేరము.

గుణవతి : మీ మాట లర్థమగుట లేదు.

గోవిందుఁడు : మన రాజ్యమున నేటినుండియు దేవా లయములలో రక్తపాతము నిషేధింపఁబడినది.

గుణవతి : ఎవరు నిషేధించిరి ?

గోవిందుఁడు : కాళీమాతయే.

గుణవతి : ఎవరు వినిరి ?

గోవిందుఁడు : నేనే.

గుణవతి : మీరా. అహాహో, నమ్మవలసినదే. ఈ నిఖిల భువనరాణి త్రిపుర భూ ధవునితో విన్నవింప వచ్చినదా ?

గోవిందుఁడు : విన్నపముతో గాదు, విచారముతో.

గుణవతి : దేవ్యాలయము వెలుపలనే మీ రాజ్యము, రాజాధికారము. ఆలయములో మీ ఆజ్ఞల నములుపఱచి దేవి నవమానింపకుఁడు.

గోవిందుఁడు : ఆజ్ఞ నాదికాదు, దేవిది.

గుణవతి : మీ నిర్ణయమే నిశ్చయమైనచో బోనిండు,

నా మతమున కడ్డు రాకుఁడు. నా మతానుసారము నన్ను పూజింపనిండు.

గోవిందుఁడు: ఆలయములో బలి నాపివేయుదునని దేవికి వాగ్దానము చేసితిని. దానిని నెఱవేర్చవలెను,

గుణవతి: నేనుగూడ చండికి మూడువందల మేకపిల్లలయు, వంద ఎనుబోతులయు రుధిరము నర్పింతునని మాట యిచ్చితిని. అది నెఱవేర్చవలెను. తమ రింక దయచేయ వచ్చును.

గోవిందుఁడు: అట్లే కానిమ్ము. (రాజు పోవును.)

(రఘుపతి ప్రవేశించును.)

గుణవతి: తండ్రీ! నా నివేదనలు దేవ్యాలయమునుండి తిరుగఁ గొట్టఁ బడినవి.

రఘుపతి: నిఱుపేదరాలి యారాధనలైనను అమూల్యములైన నీ వానితోఁ దీసిపోవునవి కావు. కాని దేవికట్టి నివేదనలు నిషేధింపబడినవి. నిరంకుశుఁడైన నృపుని యహంకారము బ్రహ్మరాక్షసియై దేవి అనుగ్రహమును దిగమింగి, యామె క్రోధారుణ నయనకాంతుల భక్తులపైఁ బ్రసరింపఁ జేయుట మన దురదృష్టము.

గుణవతి: స్వామీ! దీనివలన ఏమి సంభవించునో సెలవిండు.

రఘుపతి: అది ఆ అంబకే తెలియును. కాని యిది

మాత్రము నిశ్చయము. మాత పుణ్యక్షేత్రముపై పెత్తనము జేయు సింహాసనము నీటిబుగ్గవలె భగ్నమై శూన్యములో లీనమై పోవును.

గుణవతి : తండ్రీ! కరుణించి మమ్ముఁ గాపాడుము.

రఘుపతి : ఓహో! నేనా నిన్ను గాపాడునది. ఎవఁడీ మర్త్యామర్త్య లోకములలో సైతము తన రాజ్యప్రాభవము గూర్చి ప్రగల్భము లాడునో, ఎవని ప్రభావాల సురలు భూసురులు తలలు వంచ తలంచునో అట్టి సార్వభౌముని రాణి వగు నిన్ను—పేద బాఁపఁడ నగు నేనా? ఛీ ఛీ, సిగ్గుచేటు. ఎట్టి దుష్కాలమిది. బ్రాహ్మణ శాపము వ్యర్థమై ఉన్మత్తుని జేయుచున్నదే. (భావోద్రేకమున యజ్ఞోపవీతమును ద్రెంచుకొనబోవును.)

గుణవతి : (ఆపుచు) రాజుగారిపై కోపమును జందెముపై నేల చూపెదరు. నన్నుఁ గరుణించి దాని నుంచుము.

రఘుపతి : ఐన మా హక్కుల మా కిమ్ము.

గుణవతి : అట్లే ఇచ్చెదను. మందిరమున పూజింపఁబొందు. మీ పూజ కెట్టి యాటంకములు రావు.

రఘుపతి : నిజముగా మీ యనుగ్రహ ప్రవాహము నన్ను ముంచి వేయుచున్నది. మీ కరుణా కటాక్ష వీక్షణ లవమాత్రముననే దేవత లవమానము నుండి రక్షింపఁబడిరి. బ్రాహ్మణులు వారి పవిత్రోద్యోగములకు పునరుద్ధరింపఁబడిరి. చల్లగా వర్ధిల్లుము. (వెళ్ళును.)

(మహారాజు మఱల ప్రవేశించును.)

గోవిందుఁడు : మహారాణీ! నీ అప్రసన్నవదనము నా హృదంతరాళమును అంధకారబంధుర మొనర్చుచున్నది.

గుణవతి : పో, పొమ్ము. మన రాజకుటుంబమును శాపోపహతము గావింపకుము.

గోవిందుఁడు : ఇల్లాలి చిఱునవ్వు సర్వ శాపముల వారింప కలదు; ఆమె ప్రేమయే దైవానుగ్రహము.

గుణవతి : పొమ్ము, మఱల నీ మొగ మెన్నటికిని జూపకుము.

గోవిందుఁడు : సరే, నీవు నన్ను బిలిచినప్పుడే తిరిగి వచ్చెదను. (పోఁబోవును.)

గుణవతి : (రాజు పాదములఁ బట్టుకొని) నాథా, నన్ను క్షమింపుఁడు. ఇంత కఠినులైతి రేల? ఆఁడదాని గర్వము నాదరింప మఱచితిరా? ప్రాణప్రియా, భగ్నప్రేమ కోపరూప మును దాల్చునని మీ రెఱుఁగరా?

గోవిందుఁడు : ప్రేయసీ! నేనుమాత్రము నీ యనురాగ మును గోల్పోయి జీవింపగలనా? ఘనములు క్షణభంగురము లనియు కర్మసాక్షి శాశ్వతమనియు నే నెఱుఁగుదును.

గుణవతి : ఔను. విధిచే ఎత్తబడిన వజ్రాయుధము దించబడును, మేఘములు విచ్చిపోవును, అనంతుఁడగు భాస్కరుఁడు అనాదియగు ఆచారములఁ బ్రకాశ మొనర్పఁ గలఁడు. ఇది నిక్కము. నాథా, బ్రాహ్మణులు నిజాధికార

ముల పొందునట్లును, దేవికి బలినివేదనలు చెందునట్లును, రాజదండము హద్దు దాటకుండునట్లును, ఆజ్ఞాపింపుఁడు.

గోవిందుఁడు : ధర్మము భంగముచేయుట బ్రాహ్మణుల హక్కుగాదు. ప్రాణికోటి రక్తము దేవతల కొసంగవలసిన బలికాదు. భక్తి, ప్రేమలు రక్తలేపనముచే కలుషితములుగారాదు. సత్యము, ధర్మము పాలించుటలో రాజూ, రైతూ సమానాధికారులే.

గుణవతి : మీ పాదములఁబట్టి ప్రార్థింతును. అనుశ్రుతమగు నీ ఆచారము రాజు స్వవిషయము కాదు. గాలివలె నది మానవులందఱిది. ఐనను తదాచారమును భిక్షగా నిమ్మని ప్రజల పక్షమున మీ రాణి మన్ముంద చేతులు జోడించి వేఁడుకొనుచున్నది....సందేహాస్పదమగు నీ రాజధర్మ నిర్వహణమునకై, నా దీన ప్రార్థనల తృణీకరించి, ఇంకను మౌనముగ నున్నావా, దురహంకార పూరితుఁడా! పో పొమ్ము. నాకడ నుండి శీఘ్రముగ పొమ్ము. (వారు పోయెదరు.)

(రఘుపతి, జయసింహుఁడు, నయనరాయలు ప్రవేశింతురు.)

రఘుపతి : సేనాధిపా! మాతపై నీకుండు భక్తి యపారము, సుప్రసిద్ధము.

నయనరాయలు : మా తాత ముత్తాత తరములనుండి యీ భక్తిప్రవాహము అవిచ్ఛిన్నముగ ప్రవహించుచున్నది.

రఘుపతి : నీ భక్తి యక్షయమగు గాక. ఈ పవిత్రప్రేమ నీ కజేయమగు బాహుబలము, ధైర్యము నొసంగుఁగాక. నీ

యకుంఠిత భక్తి నీ కత్తి వాదఱను వజ్రాయుధము వలె చేసి, లోకోత్తర పదవి నలంకరింపఁజేయుగాక.

నయన : బ్రాహ్మణాశీర్వాదము రిత్తవోదు.

రఘుపతి : అటులైన నీ సైనికులఁ బ్రోగుచేసి మాత శత్రువును నాశనమొనర్పుము.

నయన : భగవానుఁడా! ఎవరా శత్రువు?

రఘు : గోవిందుఁడు.

నయన : మన మహారాజా?

రఘు : ఔను, నీ సర్వ సైన్యముతో నాతని పైఁబడుము.

నయన : ఇది దుర్బోధ, స్వామీ. ఇది నన్ను బరీక్షించుటకా?

రఘు : ఔను, నిన్ను బరీక్షించుటకే, నీ వెవరి బంటువో రూఢిగాఁ దెలిసికొనుటకు. సందేహింపకుము. దేవి పిలుపు నాలకింపుము. భవ బంధముల భేదింపుము.

నయన : సందేహ మేమియులేదు. దేవి నన్నుంచిన స్థానమున స్థిరముగ నున్నాను.

రఘు : నీవు ధీరుఁడవు.

నయన : రాజద్రోహము చేయ రమ్మని పిలుచుటకు, సర్వమంగళ సేవకులలో కెల్ల నేనే పలుచనివాడనా? ఏ మానవ హృదయ విశ్వాసముపై తా నాధారపడియున్నదో దానినే నన్ను భగ్నము గావింపుమనునా? అటులైనచో నేఁడు రాజు, మఱునాఁడు దేవి ధూళిలోఁ గలియుదురు.

జయసింహుఁడు : సెబాస్, సేనాపతీ! చక్కఁగాఁ బలికితివి.

రఘు : అదంతయు నీ భ్రాంతి, సేనాపతీ! తల్లియందు విశ్వాసములేని రాజు నీ రాజ భక్తికి తగఁడు.

నయన : తండ్రీ! తర్కారణ్యములలోనికి నన్ను దఱుమకుము. నాకుఁ దెలిసిన దొక్కటే మార్గము; సత్యము, స్వామిభక్తి విశ్వాసములతో గూడిన తిన్నని రాచబాట. మందబుద్ధియగు ఈ మాత సేవకుఁడు ఆ ధర్మపథమును తప్పఁడు.

(పోవును.)

జయసింహుఁడు : గురుదేవా! ఇట్టి విశ్వాస బలము చేతనే మన కార్యముల నిర్వహింతము. సైనికుల సాహాయ్యమేల? దైవ నిర్దేశమగు కార్యము నిర్వర్తించుటకు వలసిన శక్తి మనసులోనే యున్నది. తండ్రీ, ఆలయ ద్వారములఁ దెఱవుఁడు. భేరి మ్రోఁగింపుఁడు...రండు, రండు, జనులారా! దుర్గను బూజింపుఁడు.

ఒకఁడు : రాండ్రా, రాండి. మనల్ని పిలుస్తుండారు.

(పురజనులు వత్తురు.)

(ఆలయ ద్వారము తెరవఁబడును. దేవి పెడమోమిడి యుండును.)

అందఱు : అరరే! అమ్మోరికి కోపమొచ్చేసింది.

ఒకఁడు : తల్లీ! మేమేమి తప్పు చేసాం? మొగ మిటు త్రిప్పి మమ్ము చూడమ్మా!

ఇంకొకఁడు : తల్లీ, తల్లీ, మమ్ము రక్షించమ్మా.

అందఱు : ఓ తల్లీ! మేమంతా నీ బిడ్డలం. తెలివిలేని వాళ్ళం. నీ దయ తప్పితే మేం బ్రతకలేం. మా గొంతులో ఊపిరున్నంతవఱకు నిన్ను మఱువలేం. నీ కోసం మా ప్రాణాలైనా అర్పిస్తాం.

రఘుపతి : ఔనౌను. తల్లికొఱకు మీ ప్రాణములర్పించు తరుణ మఱుదెంచినది రండు. తల్లి పూజను ఆపుచేయుటకు రాజ సైన్యములు వచ్చుచున్నవి. మందిరద్వారమును కాపాడ వలసి యున్నది. మీ రందఱు యిచ్చట నిలువుఁడు.

ఒకఁడు : సైన్యాలు వస్తావుండయా, అలాగైతే దండాలు స్వామీ! మేము పోయి వస్తాం.

ఇంకొకఁడు : మేముండేది కొద్దిమందే, సైన్యాలు వస్తే ఏం చేయగలం.

మరొకఁడు : ఏదో చేయడానికి అందఱికీ చేతవులే, కాని సైన్యాలువస్తే యిక్కడ స్థలమేదీ? యుద్ధం సంగతి అనక చూడొచ్చు, ముందు యిక్కడ నిలవటానికి చోటేదీ?

ఇంకొకఁడు : నోరు మూయండిరా. సామి కోపంతో వణికిపోతుండాడు. సామీ! ఆజ్ఞ యివ్వండి – మా బలాల పిలుచుకొని వస్తాం.

మొదటివాఁడు : అది మంచిదిరా – ఇక ఏమాత్రం ఆలస్యం చేసినా బాగుండదు. పదండి పోదాం.

(అందఱు పోఁబోయెదరు.)

రఘుపతి : (కోపముతో) _ ఆగండి.

జయ : గురుదేవా! వారిని పోనిండు. పిఱికివారు పలుమార్లు చచ్చెదరు. మాత్ర సైనికుఁడనగు నే నున్నాను. వేయి సైనికుల బలము నాకున్నది,

రఘుపతి : కానిమ్ము, బలిని తెమ్ము, పూజ ప్రారంభింతము.

(బయట వాద్యములు మ్రోగును.)

జయసింహుఁడు : తండ్రీ! వారు సైనికులు కారు. రాణిగారి సేవకులు వేటలఁ దోలుకొని ఆలయమువైపునకు వచ్చుచున్నారు, అటు చూడుఁడు.

అందఱు : ఇఁక భయం లేదురా, తల్లి పూజ వస్తూంది.

ఒకఁడు : మన మిక్కడున్నామని తెలిసి సైన్యాలు పాఱిపోయినాయిరా, ఇక చస్తే యీ దిక్కు రావు.

అందఱు : మహాకాళికి జై, మహారాణికి జై.

రఘుపతి : జయసింహా ! సత్వరముగ పూజకు సిద్ధము సేయుము.

జయ : సర్వము సిద్ధమే.

రఘుపతి : సరి సరి. నేను బిలిచితినని యువరాజు నక్షత్రకుని బిలువ నంపుము. (జయసింహుఁడు వెళ్ళును.)

(పురజనులు ఆడి పాడెదరు.)

చెయ్యరా జాతర్లు
కొలవరా అమ్మోర్ని

చల్లాని తల్లికి
చల్లాలు పోస్తాము.
బలిసీన జీవాల
బలిచేసి వేస్తాము.
యుద్ధంలో దుర్గమ్మ
చిందులేయు చీరజాఱ
అగ్గ్యాలె ఆమెజిమ్మ
భగ్గుమని మండుతోంది.
కొప్పువీడి కురులురేగి
కప్పివేసె ఆకసాన్ని
మొయిలువంటి మైనుండి
బయలుదేరె రక్తధార
కదిలే పాదాలక్రింద
అదిరిపోయె యీ లోకం ॥చెయ్యరా॥

అందఱు: మహాకాళికి జై, మహారాణికి జై.
(అని అఱతురు.)

(రాజు ప్రవేశించును.)

గోవిందుఁడు: ఆపండి మీ ఆట పాటలు. రఘుపతీ! నా యాజ్ఞ తిరస్కరింప సాహసించితివా?

రఘు: అవును. ఇందు సేవయేగాని సాహసమేమున్నది.

గోవిందుఁడు: అటులైన నీవు నా దేశమున నుండఁ దగవు.

రఘు : ఎచట రాజముకుటము మట్టిలోఁబడి జీరాడునో అచట నా దేశమున్నది. పౌరులారా! మాత నివేదనలు లోనికిఁ దీసుకొని రండు.

(జనులు నగారాలు మ్రోయించెదరు.)

గోవిందుఁడు : నిశ్శబ్దముగ నుండుఁడు. (అనుచరులతో) భటులారా, మా సేనాపతిని గొనిరండు, పొండు...రఘుపతీ! ధర్మరక్షణకై సైనికులఁ బిలువ సిగ్గగుచున్నది. ఏలయన ఆయుధ బలము మానవ దౌర్బల్యమును వ్యక్తము చేయును.

రఘుపతి : అవిశ్వాసీ! బ్రాహ్మణులు తమ సనాతన సత్యాగ్రహాగ్నిని గోల్పోయినారని విశ్వసించితివా? లేదు. ఆ ప్రదీప్తానలజ్వాల నా హృదయమును ఛేదించుకొని బయల్వెడలి నీ సింహాసనమును భస్మీపటలము గావించును. లేకున్న ఈ సకల వేదశాస్త్రములను, నా జాత్యహంకారమును, దేవతా ఛద్మవేషమున మా పవిత్ర దేవాలయముల నలంకరించిన ఈ ముప్పది మూడు కోట్ల మిథ్యలను కాల్చివేసెదను.

(నయనరాయలు, చండపాలుఁడు ప్రవేశింతురు.)

గోవిందుఁడు : సేనానీ! ఈ ఆలయములో ప్రాణిబలి నాపుటకై నీ సైనికులతో నిచట కాఁవుండుము.

నయన : మన్నింపుము మహారాజా! దేవీ మందిరమున ఈ రాజసేవకుఁడు శక్తిహీనుఁడు.

గోవిందుఁడు : సేనాపతీ! నా యాజ్ఞల పాలించుటయే నీ పనిగాని, విమర్శించుట గాదు సుమా. వాని యోగ్యతా యోగ్యతలు నావి కాని నీవి కావు.

నయన : దేవా! నేను మీ సేవకుఁడనన్న మాట నిజమే కాని, మొదట మానవుఁడనన్న మాట అంతకంటె నిజము. నాకు జ్ఞానము, మతము ఉన్నవి. నాకు ప్రభువున్నాఁడు– దేవుఁడు కూడ నున్నాఁడు.

గోవిందు : అటులైన నీ ఖడ్గమును చండపాలున కిమ్ము. రక్తపాతముచే అపవిత్రము గాకుండ మందిరము నాతఁడు కాఁపాడును.

నయన : చండ పాలునకేల యిమ్మనెదరు? ఈ కరవాలమును మీ రాచపితరులనుండి మా పెద్దలు గ్రహించిరి. మీరు కోరినచో మీ వశము చేసెదను. వీరస్వర్గ మందున్న ఓ పితరులారా! యిందులకు మీరే సాక్షి. సాటిలేని మీ ధైర్య సాహసములచేతను, ప్రభుభక్తి పరాయణత్వముచేతను పవిత్ర మొనర్చిన ఈ కృపాణమును నేను మా రాజున కిచ్చు చున్నాను.

(వెళ్లును.)

రఘు : బ్రాహ్మణ శాపమప్పుడే పనిచేయ నారంభించినది.

గోవిందుఁడు : చండపాలా! ఈ ఖడ్గమును గ్రహించి నీ విద్యుక్తధర్మమును నెఱవేర్పుము. 'నా విష్ణుః పృథివీ పతిః' యన్న నానుడి మఱువకుము.

చండపాలుఁడు : చిత్తము.

(జయసింహుఁడు ప్రవేశించును.)

జయ : గురుదేవా! పశువుల బలికి సిద్ధము జేసితిని.

గోవిందుఁడు : బలి!

జయ : మహారాజా! మీ పాదములంటి ప్రతిమాలు కొందును; మానవుఁడ వైన నీవు దేవిని మఱుగుపఱచి మా దారి కడ్డు రాకుము.

(రాజు పాదములఁ బట్టుకొనును.)

రఘుపతి : సిగ్గు, సిగ్గు, జయసింహా! శీఘ్రముగ లెమ్ము, నా క్షమాభిక్ష వేఁడుకొమ్ము. నేను నీ గురువును, గురుచరణ సన్నిధిని నీ స్థానముగాని ప్రభువు పాదముల కడ కాదు, మూర్ఖుఁడా! దేవీపూజకు రాజాజ్ఞ కావలెనా? ఆ పూజ, ఆ బలి అట్టులే యుండనిమ్ము, తుదకతని యహంకార మెట్లు కొనసాగునో చూతము గాక. రమ్ము పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

(అపర్ణ ప్రవేశించును.)

అపర్ణ: జయసింహుఁడేడీ? అతఁ డిచట లేడు కాని నీవు మాత్రమున్నావు—సుస్థిర శిలాప్రతిమవు. ఒక్కమాటైన అనక మా సర్వస్వము దోఁచుకొందువు. మేము ప్రేమభిక్షకై యాచించి యాచించి వితథులమై కృశించి నశించుచున్నాము. అక్కఱలేకున్నను, అడుగకయే నీకది లభించును. ప్రేమతో ఎంతో ప్రయోజనముగల ప్రపంచమునకు దొరకకుండ దానిని లుబ్ధ ధనమువలె నీ మందిరముక్రింద దాచుకొందువు. జయసింహా! ఇచట నీవేమి సుఖపడుచున్నావు? నీతో ఈ దేవి ఏమి సంభాషింపగలదు? శిలా నిర్మితమగు నీ దేవళమందు

నీకు ఏ ఫలము లభించునో గదా? ప్రతి ప్రణయానురక్తులతో నలరు మానవహృదయ మీ ప్రాణహీనమగు పాషాణమున కన్న శ్రేష్ఠతరము కాదా? నీ కొఱకై నా హృదయద్వారముల తెఱచి వేచియున్నాను, రమ్ము.

(రఘుపతి ప్రవేశించును.)

రఘుపతి : ఎవతెవే నీవు? నీ కిక్కడేమి పని?

అపర్ణ : నే నొక బిచ్చగత్తెను. జయసింహుఁడేడీ?

రఘుపతి : తక్షణమే పొమ్ము. దేవి సన్నిధినుండి జయసింహుని హృదయమును దొంగిలించుకొని పోవుటకై ఈ దేవ్యాలయమున తారాడుచున్నావని నాకుఁ దెలియును.

అపర్ణ : నన్నుజూచి దేవి భయపడుచున్నదా? ఆమె భయంకరాకారమును జూచి నేనే భయపడుచున్నాను.

(పోవును.)

(జయసింహుఁడు, నక్షత్రకుఁడు ప్రవేశింతురు.)

నక్షత్రకుఁడు : గురుదేవా! నన్నేల పిలిపించితిరి?

రఘుపతి : నిన్న రాత్రి దేవి నా కలలో కాన్పించి వారము దినములలో నీవు రాజువయ్యెదవని చెప్పినది.

నక్షత్ర : ఆహా! ఆహా!! నేను నిజముగా రాజు నయ్యెదనా?

రఘు : నీవు తప్పక రాజు వయ్యెదవు.

నక్షత్ర : నే నిది నమ్మఁజాలను.

రఘు : నా మాటల సందేహింతువా?

నక్షత్ర : సందేహింపవలెనని నాకు మాత్రము కోరిక యున్నదా? కాని, ఒకవేళ అది సంభవము గాకున్న—

రఘు: లేదు, నా మాటలు నిజమై తీఱును.

నక్షత్ర : ఎట్లు?

రఘుపతి : దేవి రాజ రక్తము కొఱకై దప్పిగొని యున్నది.

నక్షత్ర : రాజ రక్తమా?

రఘు : ఔను, నీవు రాజువగుటకు ముందామెకు రాజ రక్తము నర్పించవలెను.

నక్షత్ర : అదెచ్చట దొరకునో నాకుఁ దెలియదే?

రఘుపతి : రాజు గోవిందుఁడున్నాఁడు కదా—జయసింహా! తత్తఱపడకుము - తెలిసినదా, యువరాజా? రాజును రహస్యముగ సంహరించి యా వేఁడి రక్తమును దేవి బలివేదికకుఁ దెమ్ము జయసింహా! స్థిరముగ నుండలేకున్నచో తొలగి పొమ్ము.

నక్షత్ర : అతఁడు నా అన్న. నన్ను పుత్త్రప్రాయముగ జూచును. అతడన్న నాకెంతయో ప్రేమ.

రఘు : కర్తవ్య పాలనమునఁ జుట్టఱిక మడ్డురారాదు. అతఁడు నీ సోదరుఁ డగుటచేతనే నీ త్యాగమింకను ఉత్కృష్టమైనదగును.

నక్షత్ర : నేను అన్న నెత్తుటఁ జేతులు దడుపఁజాలను.

నే నిప్పుడున్నట్లే, యువరాజుగా నుండుటకుఁ దృప్తిపడి యున్నాను. నాకీ రాజ్యము గీజ్యము వలదు.

రఘుపతి : వలదన్న బోవుట కిది మన యిష్టమా? దేవి దీని నాజ్ఞాపించి యుండుటచే నీకుఁ దప్పించుకొను మార్గము లేదు. రాజాంతఃపురమునుండి రక్తమునకై దేవి దాహము గొని యున్నది. నీ సోదరుఁడు జీవింపవలెనన్న, నీవు చచ్చి తీఱవలెను.

నక్షత్ర : తండ్రీ! నన్ను కరుణించి కాపాడుము.

రఘు : ఇది నీ చేఁ జేతుల గావలసిన పని, కానిచో దేవి నిన్ను శిక్షించును. దేవి యాజ్ఞ నెఱవేర్చునంతవఱకు నీవు జీవించియున్నను, మరణించియున్నను, స్వేచ్ఛగా నుండఁ జాలవు.

నక్షత్ర: ఐనచో కానిండు, కర్తవ్యమును సూచింపుఁడు.

రఘు : వేచియుండుము. సమయ మఱుదెంచినప్పుడు చేయవలసినదంతయుఁ జెప్పెదను. ఇఁకఁ బొమ్ము.

(నక్షత్రకుఁడు పోవును.)

జయసింహుఁడు : నా వీనుల నే నమ్మలేకున్నాను. నే విన్నదంతయు నిజమేనా? అన్న కుత్తుక నెత్తురు తమ్ముని దోయిట మృత్యుదేవత ద్రావు దుస్సంఘటనము నే నింతవఱకు కని విని ఎఱుఁగను. గురుదేవా! ఇది కరుణాసింధువగు కాత్యాయని కోరిక యని నీ వెట్లన గలిగితివి?

రఘుపతి: నా దేవిని సేవించుటకు అన్యోపాయము లేదు;

జయ : ఉపాయమా, ఏల? భగవతీ! నీ కోరిక నెఱవేర్చు కొనుటకు నీ హస్తమున ఖడ్గములేదా? ఈ దొడ్డిదారు లేల? అయ్యో, యిదెట్టి పాపము.

రఘు: పాప పుణ్యము లెట్టివో నీకేమి తెలియును?

జయ : నీవు నేర్పినదే.

రఘుపతి: అటులైన రమ్ము, ప్రాత పాఠముల మఱచి నట్లున్నది; మఱల నేర్చుకొమ్ము. పాప పుణ్యములు పిఱికి పందల శుష్క-చర్యలలో పలుమాఱు వచ్చిపడు పడికట్టు రాళ్ళు. అసలు పాపమను మాట కర్థమే లేదు. చంపుట చంపుటే. అది పాపమును కాదు, పుణ్యమును కాదు. ఈ భూ ధూళి యసంఖ్యాకములగు హత్యాణువులతో చేయఁబడి నది. అనాదియగు కాలము ప్రాణుల అశాశ్వత జీవితచరిత్రను రక్తాక్షరములతో నిరంతరము లిఖించుచున్నది. చంపుట అరణ్యములలో నున్నది; మానవ నివాసములలో నున్నది. పక్షి గూళ్ళలోను, క్రిమి కీటకాదుల నెలవులలోను, అగాధ సాగర సలిలములలోను, అంతరిక్షమునను ప్రాణికోటి సమయు చున్నది. జీవనాధారమునకై చంపుట జరుగుచున్నది. వినోద మునకై జరుగుచున్నది. అకారణముగ కూడ హత్యా కాండ జరుగుచున్నది. ఈ విశ్వగోళమున ప్రాణిహింస నిరంత రాయముగ సాగుచునే యున్నది. అనుక్షణ పరిణామకాలాత్మ యగు ఆదిశక్తి ముఖగహ్వర వినిర్గత పరిలంబమాన పిపాసా సక్త జిహ్వయై,ఘర్షిత గోస్తనీ గుచ్ఛస్రవ ద్రసోపమాన జీవా

రుణ రుధిర ధారా పూర్ణ కపాల పాత్రతో నిలిచియున్నది...
జయసింహా, నిలిచియున్నది!...

జయ : ఆపు మాపుము, గురుదేవా! అటులైన, ప్రేమ మిధ్యయా ? కరుణ పరిహాసమా ? అనాదినుండియు వినాశము కొఱకైన కామ మొక్కటే యదార్థమా? ఐనచో నీ యనంత సృష్టి ఎన్నడో తన్ను తా నాశము చేసికొనియుండదా? గురూ! నా హృదయముతో నీ వాదుకొనుచున్నావు. అటు చూడుఁడు, ఆమె తన మధురహాసముతో అనిమిషనయనయై నన్ను గాంచుచున్నది. ఓ రుధిరపానాసక్తచిత్తా!నీవు నా నల్లను గైకొందువా? ఈ కృపాణమును నా గుండెలలోఁ గ్రుచ్చుకొని జీవితమును తుదముట్టింతునా? ఈ యువకుని రక్తనాళములలోఁ బ్రవహించు వేఁడిరక్తము నీ కంత రుచికరమా? అయ్యో తల్లీ!...... రక్త పిపాసినీ – గురూ! పిలిచితిరా? నా హృదయము బాధతో హద్దుల భేదించుకొని భవాని పాద పద్మముల ముంచివేయ కోరుచున్నదని నాకుఁ దెలియును. ఇదే నిజమైన బలి కాని, రాజ రక్తమా? తండ్రీ! ప్రేమ పిపాసిని యగు తల్లిని రక్తపిపాసిని చేయుచున్నావు. ప్రేమగలచోట రక్తపాతము గారాదు.

రఘుపతి : అటులైన నీ యాలయములో బలి నిలిపి వేయనిమ్ము.

జయ : ఔను. నిలిపివేయనిమ్ము – వలదు. వలదు. భగవాన్! మంచి చెడ్డలు నీకుఁ దెలియును. ఈ హృదయ ధర్మములు వేద ధర్మములు కావు. కన్నులు స్వయంప్రకాశముచేఁ

జూడఁ జాలవు; వెలుఁగు వెలుపలనుండియే రావలెను. నన్ను క్షమింపుము, నా యవివేకమును మన్నింపుము. తండ్రీ! నిజము తెల్పుము. మీకు దేవి కలలోఁ గాన్పించి రాజు రక్తము కావలెనని చెప్పినదా?

రఘుపతి : ఏన నే సనృతమాడుచుంటినా? ఓయీ! నా మాటలయందు నీకు విశ్వాసము లేదా?

జయ : లేకేమి. నీ యందలి విశ్వాసముపై నా సర్వస్వ మాధారపడియున్నది. కాని చిన్న సందేహము.

రఘు : ఏమిటది?

జయ : నక్షత్ర రాయల జన్మ కూడ రాజవంశమునఁ గదా ఘటిల్లినది? దేవి గోరిన దా రాచరక్తమేమో?

రఘు : కాదు. కాదు. దేవతలు స్వప్నములందు సాంకేతిక సూచనలు మాత్రమే చేయుదురు. ఆ దైవ పరిభాషాన్వయమంతయు వారి ప్రవక్తలగు ధీమంతులకే విదితము. బలి నిషేధించిన రాజుపై దేవి కినుక వహించి యున్న దనుట నగ్న సత్యము. ఆమె రాజ రక్తము గోరుచున్నదన గోవిందునిదే యని మన మెఱుఁగవలయును. నీ వన్నట్లు నక్షత్ర రాయని నెత్తురు దేవి కర్పించినచో అతనికి పట్టాభిషేక మగు టెట్లు?

జయ : వాదము సహేతుకముగనే యున్నది. దేవికి రాజ రక్తమే కావలసి యున్నచో నేనే గొనివచ్చెదను. దాన భ్రాతృ హత్యా మహాపాతకము తమ్ముని కంటకుండును.

రఘు : దేవి కోరికల నెరవేర్చుటలో పాపము లేదు.

జయ : పోనిండు, పుణ్యమే యున్నచో నేను పొందె దను.

రఘు : నీవు మహారాజును జంపి లోకమున కేమని సమాధాన మీయగలవు? నక్షత్రరాయలైన అన్నను జంపి రాజ్య మేలగలడు.

జయ : ఏమైనను సరే భ్రాతృహత్య మాత్రము జరుగ నీయను. నేనే రాజరక్తము తెచ్చెదను.

రఘు : వత్సా! నీ బాల్యము నుండియు నిన్ను పెంచి తిని, నా ప్రాణముల కన్న మిన్నగా ప్రేమించుచుంటిని. ఏ హటాత్సంభవము వలనగాని నిన్ను పోగొట్టుకొన్నచో జీవింప జాలను.

జయ : తండ్రీ! నావంటి తుచ్ఛునిపై మీ కింతటి మమకారమేల? ఈ మూన్నాళ్ళ ముచ్చట కింత మురిపె మేల?

రఘు : ఈ మాట లిం కేం జాలింపుము. నక్షత్రరాయలు రానిమ్ము. తర్వాత అన్ని విషయములు మాటాడుకొందము.

జయ : యువరాజును అతని వాగ్దాన బంధము నుండి విడిపింపుడు.

రఘు : నే నాలోచించి రేపు తీర్మానించెదను.

(అతడు పోవును.)

జయ : ఈ యాలోచించుట, సందేహించుట యను నరకమునకంటె ఎంతటి క్రూర కార్యములైనను మేలు. ఈ

చింతాసాగరమున కంతులేదు. గురుదేవా! నీ వన్నదే నిజము. చంపుట పాపము కాదు, సోదరుని జంపుట పాపము కాదు, రాజును చంపుట పాపము కాదు.—ఔనౌను, అదే సత్యము, పాప పుణ్యములు లేవు......ఈ పాప పుణ్య విచికిత్సలన్నియు వృథా......సోదరులారా! ఎచటికిఁ బోవుచున్నారు? నిశి పురము సంతకా? అచ్చట అందగత్తెలు ఆడెదరా? ఓహో! ఈ లోకమెంత సుందరమైనది, యిందెంత సుఖమున్నది! ఆఁడవారి సుకుమార నాట్యాంగము లెంత మనోహరములు- జన సమూహములు విచ్చలవిడిగా, సరస సల్లాపము లాడు కొనుచు హాయిగా త్రోవలఁబట్టి పోవుచున్నవి. నేనును అనుస రించెదను. (అని పరిక్రమించును.)

(రఘుపతి ప్రవేశించును.)

రఘుపతి: జయసింహా! ఎక్కడికిఁ బోవుచుంటివి? నిలువుము.

జయ: నీ వెవరో నాకుఁ దెలియదు. నే నా గుంపులతోఁ గొట్టుకొని పోవుచున్నాను. నన్నేల నిలువమందువు? నీ దారిన నీవు పొమ్ము.

రఘు: జయసింహా! ఆఁగుము.

జయ: ఈ దారి తిన్నగా నున్నది. కరమున భిక్షా పాత్రతోఁ భిక్షుక బాలిక ప్రియురాలై వెంటరాగా ముందుకు సాగెదను. ఇహలోకయాత్ర కష్టభూయిష్టమన్న దెవరు? ఎటు తిరిగి తుదకు గమ్యస్థానము జేరగలము.—అచట సర్వ ధర్మ ములు, సర్వ నియమములు తిరోధానములగును. అచట జీవి

తములోని సుఖదుఃఖములు మఱువఁబడును. అచట విశ్రాంతి, శాశ్వత విశ్రాంతి లభించును. ఈ శాస్త్రవిధులతో ఈ ఉపదేశికునితో, అతని బోధలతో ఏమి ప్రయోజనము ?— నా గురూ! నా తండ్రీ! ఎట్టి విపరీతపు మాటలివి ? నేను కలగనుచుంటినా. సత్యమువలె నిష్ఠురమై, సుస్థిరమై దేవాలయము అట నిలిచియున్నది. గురూ! నీ ఆజ్ఞ మఱువలేదు. (కత్తిని తీసి) పదనులో నీ కత్తితో సమానమగునంతవఱకు నీ మాటల నా మెదడులో సాన బట్టుచున్నాను. వేరాజ్ఞ ఏమైన కలదా ?

రఘుపతి : కుమారా! నీపై నా కెంత గాఢమైన ప్రేమ కలదో నీ కెట్లు తెలుపఁగలను?

జయ : వలదు, వలదు, గురుదేవా! ప్రేమను గుఱించి నాకుఁ దెలుప వలదు. కేవలము నా కర్తవ్యమును గూర్చి యాలోచింపనిమ్ము, ప్రేమ తృణ, తరు, లతా, పత్రములవలె ధరణిపై యవతరించి స్వప్నము వలె నదృశ్యమై పోవును. కర్తవ్యమటుగాక దుర్వహమగు భారము వలె, కఠిన పాషాణ పంక్తులవలె హృదయాంతరాళమున నుండును.

(వారు నిష్క్రమింతురు.)

(గోవిందుఁడు, చండపాలుఁడు ప్రవేశింతురు.)

చండపాలుఁడు : ప్రభూ! మీరు మిక్కిలి జాగరూకులై యుండుఁడు.

గోవిందుఁడు : ఏల?

చండ : మీ ప్రాణహత్య కొఱకు రహస్యాలోచనలు జరుగుచుండ నే పొంచియుండి వింటిని.

గోవిందు: నా ప్రాణ మెవరికిఁ గావలయునో చెప్పుము.

చండ : చెప్పుటకు సంశయించుచున్నాము. కరవాల మునకన్న కఠోరమగు నీ వార్త తేని హృదికి వ్యథ గల్గించు నేమో యని భయమగుచున్నది.

గోవిందు : చండపాలా! నిస్సంశయముగఁ బలుకుము. అదెట్టి ఘోరవార్త యైనను సహించుటకు సన్నద్ధుఁడనై యున్నాను. ఇట్టి దురాలోచన లెవరు చేయుచున్నారో చెప్పుము.

చండ : యువరాజు నక్షత్రరాయలు...

గోవిందు : నక్షత్రకుఁడా?

చండ : దేవికి మీ రక్తము సమర్పించెదనని రఘుపతికి వాగ్దానము చేసెను.

గోవిందు : దేవికా? అటులైన ఇందతని దోషములేదు. మత విషయమున మానవుఁడు తన మానవత్వమును గోల్పోవును. ఇఁక నీ పనికిఁ బొమ్ము. నన్నొంటరిగ నుండనిమ్ము.

(చండపాలుఁడు పోవును.)

గోవిందు: (విగ్రహమును సంబోధించుచు) దేవీ! ఈ పుష్ప ముల స్వీకరించి ప్రాణికోటిని ప్రశాంతిముగ జీవింపనిమ్ము. జననీ, సర్వమంగళా! ఈ లోకములో బలహీనులు నిస్సహాయులుగను, బలవంతులు నిర్దయాత్ములుగను ఉన్నారు. దురాశకు దయ లేదు. అజ్ఞానము అహంకార పూరితమై యున్నది. గర్వము నిర్లక్ష్యముగ దుర్బలుల తన పాదముల క్రింద త్రొక్కి నలుపు

-చున్నది. శర్వాణీ, నీ కరవాలమును బైకెత్తి రుధిరమునకై యధరముల కదిలింపకుము. సోదరుని జంప సోదరుని, పురుషుని యెదుర్కొన స్త్రీని నియోగింపకుము. నేను ప్రేమించువాని చేతనే నన్ను జంపించుట నీకిష్టమేని యట్లేయగు గాక. పాపము పరిపక్వముగానిదే నశింపదు. అప్పుడది అత్యంత అసహ్యకరమైన రూపమును దాల్చును. ఎప్పుడు రాజు రక్తము సోదరుని హస్తముచే కార్చఁబడునో యప్పుడు రక్తకాంక్ష దేవతా ఛద్మవేషమును వదలి దాని పైశాచికాననమును బహిరంగపఱచును. అదే నీ యభిమతమైనచో దానికి తల యొగ్గుచున్నాను. (అని తల వంచును.)

(జయసింహుఁడు మందిరములోనికి చొరఁబడును.)

జయసింహుఁడు: దేవీ! నీకు నిజముగా రాజు రక్తము కావలెనా? నీ నోటితోనే యడుగుము, విన్నదే తడవుగా సమర్పింతును.

("నాకు రాజు రక్తము కావలెను" అని విగ్రహము వెనుకనుండి ఒక ధ్వని వినఁబడును.)

జయ: రాజా! నీ కాలము తీఱినది.

గోవిందు: అమంగళము ప్రతిహతమగు గాక. అట్లనెదవేల జయసింహా?

జయ: దేవికి తమపై గోపము వచ్చినది.

గోవిందుఁడు: నాపై దేవికి కోపము వచ్చినదా, దేవికి!

జయ: మీరు భువనేశ్వరికి బలినాపి కోపము తెప్పించితిరి.

గోవిందు: విశ్వజనని యగు ఈశ్వరికి జీవ బలి సంతోష కరమని తలచితివా? తల్లి తన బిడ్డల జీవితములను తుదముట్టింప దలచునా? నెత్తు రోడ్చుచోట నామె కన్నీరోడ్చునని తెలి యదా?

జయ: నేనును అట్లే తలంచితిని. జీవ బలి కామె విముఖ యని యెంచితిని. కాని యిప్పుడా సంశయాంధతమము విచ్చి పోయినది. దేవి చెప్పినది మీరు వినలేదా?

గోవిందు: చెప్పినది దేవి కాదు, చిరపరిచితమగు రఘు పతి కంఠస్వరము.

జయ: రఘుపతి కంఠస్వరమా? కాదు కాదు. నన్ను సందేహముల పాలు చేయకుము. ఆ కంఠస్వరము దేవిదైనను, మా గురువుదైనను వారి యాజ్ఞల తప్పక పాలింతును. ఆల సింపక కడసారి యిష్టదేవతా ప్రార్థన గావింపుము. (జయ సింహుడు కరవాల మొరనుండి దూయును. రాజు తదేక ధ్యానముతో తలవంచియుండును. వెంటనే జయసింహునకు మనసు మారి ఖడ్గము దూరముగ పాఱవైచును.)

జయ: (దేవికి బ్రణతుడై), జగన్మాతా! నీ బిడ్డల మొఱాలకింపుము. పూలను గైకొమ్ము; అందమైన పువ్వులే తల్లికి దగిన నివేదనలు; రక్తము కాదు. రక్త మిక వలదు. ఈ దాసాని పూగుత్తులు రక్తోపమానములై ఎఱ్ఱగా నున్నవి. స్వ సంతాన సంహారమున బాధపడు భూదేవి యెద బ్రద్దలు చేసు కొని యవతరించుటచే వీనికీ రక్తిమ ఏర్పడినది. ఈ పూల నంగీకరింపుము; నీ వంగీకరింపక తప్పదు. నీ కోపమును లక్ష్య

పెట్టను. రక్తము నీ కిఁక దుర్లభము. నీ కనులెఱ్ఱఁజేసినను, నీ కరవాలమెత్తి నన్ను ఖండింపవచ్చినను, నీకు నే భయపడను. ప్రభూ! నన్ను మన్నించి యాలయమును వదలిపొండు.

(గోవిందుఁడు పోవును.)

జయ: ఆహా! ఎంత సాహసమున కొడిగట్టితిని. నా గురువును, నా దేవిని నా సర్వస్వమును క్షణములో త్యజించితినే. ఇప్పుడీ వేయిదారుల మైదానములో ఏ దారి ననుసరింతును?

(రఘుపతి ప్రవేశించును.)

రఘు: అంతయు వింటిని. ద్రోహీ! విశ్వాసఘాతకుఁడా! నీ గురువును నమ్మించి మోసగించితివి. తత్పాప ఫలమనుభవింపుము.

జయ : తండ్రీ! నన్ను శిక్షింపుము.

రఘు : నీ కెట్టి శిక్ష కావలెను?

జయ : మరణ శిక్ష.

రఘు : మరణమొక లెక్కలోనిది కాదు. పుట్టినవారెల్ల గిట్టక తప్పదు. దేవి పాదములంటి ప్రతిన జేయుము.

జయము : అంటితిని.

రయపతి : పలుకుము. "పరాశక్తి పాదముల సాక్షిగా అర్ధరాత్రము గాకమున్నే రాజరక్తము దెచ్చి దేవి పాద కమలములం దిడెదను."

జయ : "పరాశక్తి పాదముల సాక్షిగా అర్ధరాత్రము

గాకమున్నే రాచరక్తము దెచ్చి దేవి పాద కమలములం దిడెదను.''

(ఇరువురు నిష్క్రమింతురు.)

(గుణవతి ప్రవేశించును.)

గుణవతి : నే నోడితిని. కొంతసేపు బిగువుగ నుండిన నా భర్త లొంగునని యాశించితిని. నా శక్తిలో నంత విశ్వాస ముండినది. త్వరపడి కోపమును జూపి యతనికి దూరముగ నుంటిని. గాని నిష్ప్రయోజనమైనది. వనిత కోపము వజ్రపుం గాంతి వంటిది; యా కాంతి శోభించునే గాని శోషింపంజాలదు. అటుగాక అదే మహా శక్తినంతమైన పిడుగువలె రాజ ప్రాసాదముపై కురికి, నిదుర మత్తును దులిపి, త్రుళ్ళిపడం జేసి రాజు గర్వమును నేలపాలు గావించియుండిన నెంత బాగుండెడిది!

(బాల ధ్రువుండు ప్రవేశించును)

గుణవతి : ధ్రువా! ఎక్కడికిం బోవుచున్నావు?

ధ్రువుండు : మహారాజు వద్దకు. (పోవును.)

గుణవతి : ఈ బాలకుండు రాజునకు ప్రేమాస్పదుండు. నాకుం బుట్టంబోవు బిడ్డల పితృప్రేమను దొంగిలించినాండు. తండ్రి హృదయమున బిడ్డల జన్మహక్కగు ప్రథమస్థానము నక్రమముగా నాక్రమించుకొన్నాండు. ఓ తల్లీ! మహాకాళీ! నీ సృష్టి విచిత్రము. ఒక్క పసికూనను ప్రసాదింపుము, నీవు కోరినది సమర్పింతును. (నక్షత్రకుండు ప్రవేశించి, రాణిని జూచి వెనుకకు తగ్గును.)

గుణ: యువరాజా! వెనుదిరిగి పోయెదవేలనయ్యా? నే నబలను, నిరాయుధను, నన్నుజూచి వెఱువనేల? భద్రకాళివలె నే నంత భయంకరముగ నున్నానా?

నక్షత్ర: లేదు. లేదు. నన్ను బిలువ వలదు.

గుణవతి: ఏల? ఇందులో దోష మేమున్నది?

నక్షత్ర: రాజు నగుటకు నా కిష్టములేదు.

గుణవతి: పోనిమ్ము. మునిగిపోయిన దేమున్నది? నీవేల ఇంత తత్తర పడుచున్నావు?

నక్షత్ర: మహారాజు చిరకాలము జీవించుగాక; నేనట్లే యువరాజుగనే మరణించెదఁగాక.

గుణవతి: చేతనైనంత శీఘ్రముగ మరణింపుము; నే నెన్నడైన వలదంటినా?

నక్షత్ర: సరి సరి. నన్నెందులకు పిలిచితివో చెప్పుము.

గుణవతి: రాజ కిరీటమును హరించు చోరుఁడు నిన్ను గాచియున్నాఁడు. పట్టుకొనుము; బోధపడినదా?

నక్షత్ర: బోధపడినట్లేకాని యాచోరుఁ డెవఁడాయని?

గుణవతి: అడుగో, ఆ బాలుఁడు ధ్రువుఁడు. రాజాంక మునఁ బెరుగుచు నీ కిరీట మపహరింపనున్న చోరుఁ డతడే. అగపడుట లేదా?

నక్షత్ర: అవునవును, అర్థమైనది. ఈ విషయమై అనేకమారు లాలోచించితిని. మా అన్న వానితో నాడుకొను నప్పుడు తన వెలలేని కిరీటము నా బాలుని శిరముపై నిడుట కనులారఁ గాంచితిని.

గుణవతి: అమూల్యమైన కిరీటముతో ఆటలు అపాయకరము. ఆటగానిని తొలగింపనిచే నిన్నే ఆడింపగలఁడు.

నక్షత్ర : అవును. నా కది యిష్టము లేదు.

గుణవతి : అయిన ఆ బాలుని కాళికి బలి యిమ్ము. రుద్రాణి రక్తపిపాసినియై యున్నదని వినలేదా ?

నక్షత్ర : వదినా ! యిది నా పని కాదు.

గుణవతి : మూర్ఖుఁడా ! మాత శాంతించునంతవఱకు నీవు క్షేమముగ నుండఁజాలవు. దాక్షాయణి రక్తదాహము కలది. రక్తమామెకుఁ గావలెను. చేతనైనచో నీ రక్తమును గాపాడుకొనుము.

నక్షత్ర : మఱి యామెకు రాజు రక్తము కావలెనట.

గుణ : (అదిరిపడి) అని నీ కెవరు చెప్పిరి?

నక్షత్ర : ఆమె ప్రతినిధియే.

గుణవతి : అటులైన రాజుకు మారా బాలుఁడు బలి కావలసినదే. ఆ బాలుఁడన్న మహారాజునకుఁ బంచప్రాణములు. అతని ప్రాణము కన్న ప్రియమైన దాని నర్పించిననే గాని మహారాజును రక్షింపలేము.

నక్షత్ర : అర్థమైనది.

గుణవతి : ఐనచోఁ ద్వరపడుము. ఆ బాలుని వెంబడింపుము, చాల దవ్వోగియుండఁడు. ఒక్కమాట మఱువకుము; ఆ బాలుని దేవికి నా పేర బలి యిమ్ము.

నక్షత్ర : అట్లే చేసెదను.

గుణవతి: మాత మందిరమునుండి మహారాణి వేటలు తిరుగ గొట్టఁ బడినవి. నన్ను క్షమింపమని దేవిని ప్రార్థింపుము.
(వారు బయటికిఁ బోయెదరు.)

(జయసింహుఁడు ప్రవేశించును.)

జయసింహుఁడు: దేవీ! నీ నిలయములో యింకను నశింపక మిగిలిన అణువేదైన కలదా? దూరమందున్న సంజ తారలలో నీ వెలుగు ఏ మాత్రమున్నను నా మొఱాలకించి 'బిడ్డా! ఇట నే నున్నా' నని ప్రత్యుత్తరమిమ్ము. లేదు, లేదు అంబ ఎచ్చటను లేదు. ఆమె కేవల మిథ్యామూర్తి. ఓ మాయా స్వరూపిణీ! యీ దీనునిపైఁ గరుణించి సత్యస్వరూపిణివగుము, నా ప్రేమ సహితము నీలో చైతన్యమును గలిగింపజాలనంతటి మిథ్యామూర్తివా? ఓయి మూర్ఖుడా! నీ వెవరికై నీ జీవిత మధు భాండమును దలక్రిందులుచేసి చుక్క మిగులకుండ శూన్యము చేసికొంటివి. సత్యము, కరుణ, వాత్సల్యములేని మారు బలుకని శిలాప్రతిమ కొఱకా! (అపర్ణ ప్రవేశించును.) అపర్ణా? రమ్ము. వారు నిన్నెన్నిసారులు తఱిమివేసినను తిరిగి యీ దేవళమునకే వత్తువు. ఏలయన నీవు సత్యమవు; సత్యము నెవరుగాని తరిమివేయలేరు. మేము అసత్యమును అత్యంత భక్తితో మా దేవాలయములలో పావనమూర్తిగా ప్రతిష్ఠించి పూజింతుము, అయినను ఆ మూర్తి యచ్చటయుండనే యుండదు. నన్ను వదలకుము. అపర్ణా! నా ప్రక్కన కూర్చుండుము. ప్రియా! ఏల యింత విచారముగ నున్నావు? నీ యిష్ట

దైవమును పోగొట్టుకొంటివా? పోనిమ్ము, ఆ దేవునితో మన కేమి పని? నిర్భయముగ నాస్తికులమై కలిసి మెలిసి యుందము, ఈ మన చిన్న ప్రణయ ప్రపంచమే వేఱు. దేవతలకు మన రక్తము కావలెను. దానికొఱకై వారు దివ్యభోగముల వదలి దివినుండి భువికి దిగివచ్చినారు. ఏలయందువా, వారి స్వర్గలోకములో ఇట్టి బాధల పడుటాలు మానవులు లేరు, జంతువులు లేవు. లేదు ప్రియా! దేవి నిజముగ లేనే లేదు.

అపర్ణ : అట్టులైన ఆలయమును విడిచి నాతో రమ్ము.

జయ : విడువమందువా ? సరే విడిచెదను. అయ్యో, అపర్ణా! ఆలయమును విడిచి వెళ్ళవలెనా? ఐనచో దేవికి నా తుది ఋణమును జెల్లించి వెళ్ళవలెను. అది యటుండనిమ్ము. ప్రియా, దాపునకు రమ్ము. మరణమునే మరపించు మధురాలాపములచే నా వీనులకు విందొనర్పుము.

అపర్ణ : హృదయ భాండము నిండుగ నున్నప్పుడు వాక్సలిలము పొర్లదు.

జయ: ఆ వేదనాపూర్ణమైన నా యెదపై నీ తల నానించి ప్రశాంతిని చేకూర్చుము. జీవ మరణములను రెండు శాశ్వతత్వముల నిశ్శబ్దత ఏకము గానిమ్ము.........ఇంక జాలు, నే బోవలెను.

అపర్ణ : జయసింహా! క్రూరుడవు గాకుము. నే పడిన బాధలకు యిదా ప్రతిఫలము?

జయ : నేను క్రూరుడనా ? కడ కిదియేనా నీ వనవల సినమాట; అన్నమాట ? పెనుభూతివంటి యీ దేవివలె

క్రూరుడనా? అయ్యో! అపర్ణా, నీవే దేవివై యుండిన, యీ అంతర్దావానల మెంత దుస్సహమైనదో ఎఱిఁగియుండెడి దానవు. ఏమైననేమి, నీవు నా దేవివి. నే నిది యెట్లు గ్రహింప గలిగితినో నీకుఁ దెలియునా?

అపర్ణ : చెప్పుము. వినఁ గుతూహలముగ నున్నది.

జయ : తల్లి బిడ్డ కొఱకు కొనర్చునట్టి ప్రతిక్షణము నా కొఱకు త్యాగ మొనర్చుచున్నావు. భగవంతుఁడు యీ చరాచర సృష్టికి తన ప్రాణమును ధారపోసి సంపూర్ణ త్యాగ స్వరూపుఁడు కావలెను.

అపర్ణ : జయసింహా! రమ్ము, ఆలయమును వదలి పోవుదము.

జయ : అపర్ణా! నన్ను గరుణించి వదలిపొమ్ము, దేవి సేవయే నా జీవితైక లక్ష్యము. ఆ స్థానము నాక్రమింపకుము. (వేగముగ బయటికిఁ బోవును.)

అపర్ణ : అష్ట కష్టము లనుభవించితిని. మనోధైర్యము క్షీణించినది. హృదయము భగ్నమైనది. (నిష్క్రమించును.)

(రఘుపతి, నక్షత్రకుఁడు ప్రవేశింతురు.)

రఘుపతి : యువరాజా! నీ వా పిల్లవానిని యెచట నుంచితివి.

నక్షత్రకుఁడు : పూజాపాత్రము లుండు గదిలో వాఁడు వెక్కి వెక్కి యేడ్చి నిద్రించెను. వాఁడు మేల్కాంచి మరల యేడ్చినచో సహింపఁజాలను.

రఘుపతి : జయసింహుఁడు నా వద్దకు వచ్చినప్పు డితని

వయస్సువాఁడే. నేటి సాయంతనమునలె నాడును పినుగాలి వీచుచుండెను. కాంతి హీనమగు దీపకళిక గాలికి తల యూచుచుండెను. కాళీచరణములపై వాఁడేడ్చి యేడ్చి నిదుర గూరెను. వాని పాలబుగ్గలపై కన్నీరు చాఱలు గట్టియుండెను.

నక్షత్ర: తండ్రీ! ఆలసింపకుఁడు. బాలుఁడు నిద్రించుచుండగనే పని ముగింపఁ గోరెదను. కత్తివలె వాని యేడ్పు నా హృదయమును జీల్చుచున్నది.

రఘు. వాఁడు మేల్కాంచినచో మూలికా ప్రయోగముచే నిద్ర బుచ్చెదను.

నక్షత్ర: వేగిరపడనిచో మహారాజు కనుగొనగలఁడు. సాయం సమయమున రాజు రాజ్యభారమును వదలి యీ బాలకుని జూడవచ్చును.

రఘు: దేవియం దధికతర విశ్వాసముంచుము. బలిపశువిప్పు డామె చేతిలోనున్నది, తప్పించుకొనిపోలేదు.

నక్షత్ర: కాని చండపాలుఁ డప్రమత్తుడై యున్నాఁడు.

రఘు: మన మాత కంటెనా?

నక్షత్ర: మందిర కుడ్యముపై మానిసి నీడ పడినట్లున్నది.

రఘు: అది నీ వెఱపు నీడ.

నక్షత్ర: మన మొక ధ్వని వినలేదా?

రఘు: అది నీ హృదయ ధ్వని. యువరాజా, అధైర్యమును పారద్రోలుము. పవిత్రమైన ఈ ద్రాక్షాసవము త్రావుదము. (ఇరువురు మద్యమును సేవింతురు.) మనసులో కార్యభార మెందాఁక నిలిచియుండునో అందాక నది బ్రహ్మాండ

ముఁగ నుండును. కార్యాచరణమున నది చిన్నదై పోవును. ఆవిరి వల్లనై పట్టుఁగ వ్యాపించియున్నను, ద్రవించినపుడు చిన్నవి జలకణములగును. యువరాజా! ఇదెంత పని? దీప మార్పి వేయునంతసేపు పట్టదు. అంబుద శ్యామలమైన ఆషాఢ నిశీథమున మెఱసి మాయమగు మెఱపుతీగవలె తృటిలో జీవన జ్యోతి యాఱిపోవును. దానితో రాజ గర్వమునకు పిడుగుపాటగును. పలుకవేల యువరాజా?

నక్షత్ర: మన మీ విషయమున తొందరపడరాదు. రేపు రాత్రివఱకు ఈ పని నిలుపుట మంచిది.

రఘు: రేపు రాత్రి యెంత మంచిదో ఈ రేయి అంత మంచిది. బహుశః అంతకంటె మంచిదేమో.

నక్షత్ర: అడుగుల చప్పుడాలకింపుఁడు.

రఘు: నాకు వినఁబడలేదే.

నక్షత్ర: అటు చూడుము—వెలుతురు సమీపించు చున్నట్లున్నది.

రఘు: రాజు వచ్చుచున్నాఁడు. ఆలసింపరాదు. ఖడ్గ మేదీ? జై మహా కాళీ!

(భటులతో రాజు వడివడిగ వచ్చును.)

గోవిందుఁడు: వారిని బంధింపుఁడు. (రఘుపతితో) నీవు చెప్పుకొనవలసిన దేమైనా నున్నదా?

రఘుపతి: ఏమియు లేదు.

గోవిందు: అటులైన నేరము నొప్పుకొన్నట్లేనా?

రఘు: నేరమా? ఏమఱిపాటున మాత సేవ చేయు

నాలసించుటయే నా నేరము. ఐనను నా నేరమునకుఁ దీర్పరివి నీవు గావు.

గోవిందుడు: మఱి నీకుఁ దీర్పరు లెవరు ?

రఘు: నేను దేవీ చరణ సేవకుఁడను. నాకుఁ దీర్పరి త్రిపురేశ్వరియే.

గోవిందుఁడు: ఆమె ఎల్ల తీర్పులకుఁ దీర్పరి. ఈ లోకమున న్యాయమును బాలింప నన్నామె నియమించెను. నేను దండగీంద్రను దండింతును. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ రాజ ధర్మము గాన నీ నేరమునకు శిక్ష విధింప నధికారిని నేనే. చెప్పుము, బలి చేయుటకై ఈ బాలుని దెప్పించితివా లేదా ?

రఘు: ఔను.

గోవిందుఁడు: నీ నేరము ఘోరమైనది. నీ తప్పు క్షమింపరానిది.

రఘు: తప్పా! దేవి యాజ్ఞానుసారము నే నట్లొనర్చితిని. మాత చేతులనుండి బలి పశువును బలవంతముగ హరించి, పూజా భంగము గావించి నీవే తప్పుచేసితివి, దేవి నీ తప్పునకుఁ దగిన దండన విధింపఁగలదు.

గోవిందుఁడు: రఘుపతీ! నన్నింకను బెదిరింపఁ జూడకుము. నీ నేరము ఋజువైనది. నా శాసన ప్రకారము నా భటులు నిన్ను నా రాజ్యసీమను దాటింతురు.

రఘుపతి: మహారాజా! నా జీవితములో నింతవఱకు ఏ మానవ మాత్రునకుగాని మోకరిల్లి యెఱుగను. నేను బ్రాహ్మణుఁడను. నీవు క్షత్రియుడవు. నీ కులము నా కులము

కన్న తక్కువది. ఐనను, మ్రొక్కి యాచించుచున్నాను, ఒక్క దినము గడువిండు.

గోవిందు: ఇచ్చితిని.

రఘు: (అవహేళనగా) మీరు రాజాధిరాజులు. మీ రాజసము, దయారసము రెండును అమేయములు. మఱి నేనో - ఈ దుమ్ములో దొరలాడు కీటక మాత్రుఁడను.

(బయటికిఁ బోవును.)

గోవిందుఁడు: నక్షత్రకా! నీ నేర మంగీకరించితివా, లేక యింకను తిరస్కారమేమైన గలదా?

నక్షత్ర: ఆర్యా! నేను నేరస్థుడను. తమ క్షమాభిక్షకు నడుగుటకైనను తగను.

గోవిందుఁడు: యువరాజా! నీ హృదయ మతి కోమలమైనదని నాకుఁ దెలియును. ఈ దురాలోచనలతో నిన్నెవరు వంచించిరో చెప్పుము.

నక్షత్ర: ప్రభూ! ఒకరి పేరేల బేర్కొనవలెను? నా యపరాధము నాదియే. మీ యీ యవివేక సోదరుని యనేక మారులు క్షమించితిరి. ఇంకొక్కసారి క్షమింప వేడెదను. (అని రాజు పాదములపైఁ బడును.)

గోవిందుఁడు: నక్షత్రకా! పాదముల వదలుము, లెమ్ము. నిందితుని కన్న మిన్నగా న్యాయాధిపతి ధర్మబద్ధుడై యున్నాడు.

భటులు: ప్రభూ! ఇతఁడు మీ సహోదరుఁడు. పశ్చాత్తాప చిత్తుడగు తమ్ముని క్షమింపుడు.

గోవిందుఁడు: ద్రోహి తన వాఁడైనను పరుఁడైనను నొక్కటియే. శిక్షా స్మృతిలో బంధుప్రీతికిఁ దావులేదు. శాసన ధిక్కృతి యొనర్చిన నక్షత్రకుఁడు శిక్షార్హుఁడు. త్రిపుర రాజ్య సీమావధుల కావల పావన బ్రహ్మపుత్రానదీ తీరమున నక్షత్రకుఁడు పంచవర్షములు ప్రవాసితుఁడై యుండుఁగాక. (సోదరుని చేతులఁ బట్టుకొని) తమ్ముఁడా. ఈ శిక్ష నీకు మాత్రమే గాదు. నాకుఁగూడ—అంతకన్న అధికమే దానిని నా శరీరముతో పంచుకొనలేనందున. రాజాంతఃపురమున నీవు లేని కొఱత నా హృదయమునను దినము వేయి సూదులతోఁ గ్రుచ్చుచుండును. ప్రవాస కాలమున దేవతలు నిన్ను రక్షింతురు గాక! (అందఱు పోయెదరు.)

(రఘుపతి, జయసింహుఁడు ప్రవేశింతురు.)

రఘుపతి: నా గర్వము నేలపాలైనది. నా బ్రాహ్మణత్వమును అవమానపఱచితిని. కుమారా! నేనిక నీ గురువునుగాను. నిన్న నిన్ను ఆజ్ఞాపించుటకు అధికారముండినది. నేఁడు నీ యనుగ్రహము నర్థింపవలసి వచ్చినది. రాజాధికారమును సహితము దిరస్కరింప శక్తినిచ్చిన ఆ దివ్య తేజము నాలో నశించినది. మట్టి దీపమును చమురుతో నింపి మఱల మఱల వెలిఁగింపవచ్చును. గాని రాలిపోయిన నక్షత్రము తిరిగి రాదు. నేనా నష్ట తారను. జీవిత దినములు క్షణభంగురములు. భగవంతుఁడు మానవకోటికిఁ బ్రసాదించిన వరములలో కెల్ల క్షుద్రములు. అట్టి వానిలో నొక్క దినమునకై రాజునకు మోకరిల్లి యాచింపవలసి వచ్చినది. ఆ ఒక్కదినము వ్యర్థము

కారాదు. అపకీర్తితో నల్లనైన ఈ రేయి గతించు లోపున రాజు రక్తముతో నెఱ్ఱ జేసి తత్కళంకమును కడిగివేయవలెను. వత్సా! మాటాడవేల? నిన్ను బాల్యమునుండియు ప్రాణాధికముగఁ బ్రేమించితిని; మాతకంటె మమతతోఁ బెంచి పెద్దను జేసితిని. నీ కన్న తండ్రికంటె నధికుడను. నీ కిన్ని విధముల చెప్పవలెనా? ఎవఁడు ప్రేమభిక్షకై యాచింపవలసి యుండునో వాఁడు దీనాతి దీనుఁడు. ఇంకను మౌనముగా నున్నావా? బిడ్డా! నే నెన్నడేని యపరాధ మొనర్చితినా? ఐనచో క్షమాభిక్ష వేడుచున్నాను. (మోకరిల్లబోవ జయసింహుఁడు వారించును.)

జయసింహుఁడు: తండ్రీ! యిది యేటి విపరీతము? విదీర్ణమైయున్న నా యురమును వజ్రసమానములైన మాటలచే నేల చీల్తువు? మిమ్ము నే వీడఁజాలను. మీ యాదేశమే నా కవశ్యాచరణీయము. దేవి రాచరక్తమునకై దప్పిగొని యున్నచో ఈ రాత్రికే తెచ్చెదను. నా రాకకై వేచి యుండుఁడు. (వెళ్లును)

(బయట తుఫాను.)

రఘుపతి: నేఁడే పూజా రాత్రము. కడకామె శక్తి స్వరూపము మేల్కాంచినది. ఆమె శాప సముదాయము భయంకరార్భటులతో పట్టణమంతయు ప్రాకుచున్నది. తీవ్ర క్రోధానిలము విశ్వ తరు శాఖల నూఁపుచున్నది. చుక్కలు ప్రకటమై ఉరలుచున్నవి. నా తల్లీ! యిన్ని దినములు నీ భక్తుల నేల సంశయగ్లానుల సుకఁ జేసితివి?

నీ ఖడ్గమును నీవే యెత్తుము. నీ మహా భుజ బలమున కార్యమును స్వయముగ సాధింపుము. అదిగో, యడుగుల చప్పుడు.

(అపర్ణ ప్రవేశించును.)

అపర్ణ: జయసింహుఁ డేడీ?

రఘుపతి: దూరముగ బొమ్ము, దుశ్శకునమా! (అపర్ణ వెళ్లును.) ఒకవేళ జయసింహుఁ డిఁక తిరిగి రాడేమో? అటు జరుగదు. అతఁడు తన వాగ్దానమును భంగము గావింపఁడు... నీకు జయమగుగాక! మహాకాళీ! విజయ ప్రదాయినీ,—ఒక వేళ ఏదైన ఆటంకము కలిగిన? రక్షక భటుల చేఁజిక్కి ప్రాణముల గోల్పోయినచో,—జై మహాకాళీ! జై జగద్భక్షూ! జై అపరాజితా! అజేయురాలవన్న నీ కీర్తిని నిలబెట్టుకొనుము; నీ శత్రువులు నిన్నుజూచి నవ్వనీకుము. నీ భక్తులకు నీవు తల్లివి. తల్లిపై వారికుండు అభిమానము, విశ్వాసము నశించి, అవిశ్వాసుల ముందు సిగ్గుతో తలలు వంచవలసినచో ఇఁక ఈ అనాధ లోకమున నీ ప్రతిష్ట నిలుప మిగులువారెవ్వరు? (వినుట నభినయించి) అది జయ సింహుని పద ధ్వని. ఇంత శీఘ్రముమే వచ్చుచున్నాడే? కార్యవిఫలుఁడై రాలేదు కదా! అది అసంభవము. ఓ మానవ కపాల మాలాలంకృతా! సర్వకాల నియంతా! నీ యద్భుత ఘటనకు కాలపరిమాణ మనవసరము.

(జయసింహుఁడు లోనికిఁ జొరఁబడును.)

జయసింహా! రక్తమేదీ?

జయ: నా వద్ద నున్నది. నా చేతుల వదలుము. నా

చేతులతో స్వయముగ దేవికర్పింప నిమ్ము. (గుడిలో ప్రవేశించి, దేవినుద్దేశించి) తల్లీ! యీ సమస్త జీవలోకమునకు ప్రాణ దుగ్ధమునిచ్చి పోషించు నీకు రాచరక్తము కావలెనా! నేను క్షత్రియుఁడను. మా పితృవ్యుఁడు త్రిపురాధినేత. తత్సంతాన రక్తము రాజ రక్తమే. తల్లీ, నీవు కోరిన దదే కదా? అప్పుడు రాచరక్తమే నా రక్త నాళములలో ప్రవహించుచున్నది. దాని గైకొని నీ మహారక్తదాహమును శాశ్వతముగ దీర్చుకొనుము.

(కత్తితో పొడుచుకొని పడిపోవును.)

రఘుపతి: అయ్యో, జయసింహా! ఇంతఁ గ్రూరుఁడ వైతివా! ఓరీ కృతఘ్నుఁడా! ఎంత ఘోర నేరము చేసితివిరా. నీ తండ్రినే చంపితివే — నాయనా, జయసింహా! నన్ను క్షమింపుము. నా హృదయైక నిధానమా! తిరిగి రమ్ము. నీ బదులు నన్ను చావనిమ్ము,

(అపర్ణ ప్రవేశించును.)

అపర్ణ: నాకుఁ బిచ్చెత్తిపోవుచున్నది. జయసింహుఁ డేడీ, ఎక్కడున్నాడు?

రఘు: రా, అపర్ణా! నా చిట్టి తల్లీ రా! నీ నిండు ప్రేమతో నాతనిఁ బిలువుము. నీ పిలుపుతో నాతని పునర్జీవితుని జేయుము. అతఁడు బ్రతికిన జాలును నన్ను. నీ నాతని దీసికొనిపోయి నాకు దూరముచేసినను సరే.

(అపర్ణ లోపల ప్రవేశించి జయసిం[illegible] కళేబరమునుజూచి మూర్ఛిల్లును.)

రఘుపతి : (తల నేలకు కొట్టుకొనుచు) జయసింహుఁ బ్రతికింపుము, బ్రతికింపుము, బ్రతికింపుము. నా జయసింహుని తిరిగి నాకిమ్ము. (లేచి నిలువఁబడి దేవీ విగ్రహము నుద్దేశించి) ఈ సర్వప్రపంచము నీప్రాంగణమున విలపించుచున్నను, నీ పాషాణ పాదతలమున తమంత తా అత్యంత ఉదారహృదయములు బ్రయ్యలగుచున్నను వినక, కనక, పలుకక – అట ఎటు నిశ్శబ్ద రాజ్యమేలుచున్నావో చూడు. నా జయసింహుని మరల నా కిమ్ము. అయ్యయ్యో, యిదంతయు వృథా ప్రయాసము. ఈ నితాంత దుఃఖప్రలాపములన్నియు శూన్యములో గలియవలసి నదే. ఈ శూన్యమునే శిలావిగ్రహములతో నింపి దేవతలని భక్తితో పూజించుచున్నాము. ఈ మూర్తులే లక్షలాది యనర్ఘప్రాణుల బలిగొన్నవి. దయాశూన్యములైన ఈ శిలా విగ్రహములకు స్వస్తి. శిలారూపమును దాల్చి, లోకమునకు భారమైన ఈ మన మూఢ విశ్వాసములకు స్వస్తి. (అని యఱచుచు దేవీ విగ్రహము నావల బారవైచి ప్రాంగణమునకు వచ్చును.)

(గుణవతి ప్రవేశించును.)

గుణవతి : జయము, జయము, మహాకాళికి —అరరే! దేవీ విగ్రహమేదీ ?

రఘుపతి : దేవీ లేదు, దయ్యమూ లేదు.

గుణవతి : స్వామీ! దేవిని తిరిగి ప్రతిష్ఠింపుఁడు. దేవి పూజకై నా నివేదనల తెచ్చితిని. నా వాగ్దానము నిలబెట్టు కొంటిని. నాపైఁ గరుణించి దేవిని ప్రతిష్ఠింపుఁడు. ఈ ఒక్క

రాత్రికైనను చాలును. తొలుత దేవి యెచ్చట నున్నదో చెప్పుఁడు.

రఘుపతి: ఈ భూనభోంతరాళములం దెచ్చటను లేదు.

గుణవతి: గురుదేవా! ఇచ్చట ఈ ఆలయములో దేవి యుండెనే?

రఘుపతి: దేవి! లోకములో ఎందైన నిజమైన దేవియే యుండిన, ఈ పాషాణప్రతిమను దేవి యని పిలుచుట సహించియుండునా?

గుణవతి: నన్ను వేధింపక నిజము తెల్పుఁడు. దేవి లేదా?

రఘుపతి: లేదు, లేదు, లేదు, ముమ్మాటికి లేదు.

గుణవతి: అట్లైన ఇంతకాల మిఁట నుండిన దెవరు?

రఘుపతి: మిథ్య, 'బ' కార పూర్ణానుస్వార 'డ' కారము.

(అపర్ణ ఆలయమునుండి వెలికివచ్చును.)

అపర్ణ: తండ్రీ!

రఘుపతి: ఆహా! 'తండ్రీ' యని పిలిచితివా? బిడ్డా! ఇట్లు పిలిచి నన్ను పరిహాసించుట లేదుకదా? నీ పిలుపు నిందా గర్భితము కాదుకదా? నా చేతులారఁ జంపుకొన్న నా చిన్ని కుమారుఁడు తన స్మారక చిహ్నముగ ఈ ముద్దు పిలుపు నీ మధుర కంఠమున వదలి వెళ్ళెను.

అపర్ణ: తండ్రీ! ఆలయమును వదలిపోదము పద.

(రాజు ప్రవేశించును.)

గోవిందుఁడు: దేవి యేమైనది?

రఘుపతి : మాయమైనది.

గోవిందుఁడు : ఐన ఈ రక్తప్రవాహమేమి ?

రఘుపతి : (నిర్వేదముతో) రాజా! మిమ్మాశ్రాధ్య దేవునిగా ప్రేమించిన జయసింహుఁడు తన్నుతాఁ జంపుకొనెను.

గోవిందుఁడు : ఆఁ! తన్ను తాఁ జంపుకొనెనా ? ఏల ?

రఘుపతి : అమాయక ప్రాణుల వేడి రక్తమును ప్రావు అసత్యరాకసిని జంపుటకు——

గోవిందుఁడు : జయసింహుఁడు మహనీయుఁడు. తన ప్రాణమును బలి యిచ్చి మృత్యువునే జయించెను. నా హృదిలో పుణ్యమూర్తి కల్పించుచున్నాను.

గుణవతి : నాథా !

గోవిందుఁడు : ఏమి, ప్రియా ?

గుణవతి : దేవి యిఁక లేదా !

గోవిందుఁడు: దేవి తన కఠిన శిలారూపమును ఛేదించుకొని కరుణాపూరితమగు స్త్రీహృదయమునకు తిరిగి వచ్చినది.

అపర్ణ : తండ్రీ! పోదము రమ్ము.

రఘుపతి : రా, తనయా! రా, తల్లీ! నీలో కాళీ మాతను కనుఁగొంటిని. నీవు జయసింహుని తుది కానుకవు.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

(సంపూర్ణము)

# రాజు - రాణి

రచన:

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

*

అనువాదకులు:

యన్. బ్రహ్మయ్య, బి. ఏ., బి. ఎల్.

# రాజు - రాణి

## నాటకమునందలి పాత్రలు

---

### పురుషులు

1. విక్రమసింహుఁడు ... రాజు
2. దేవదత్తుఁడు ... రాజు వేడుక చెలికాఁడు
3. మంత్రి
4. సేనాధిపతి
5. రాజ సర్దారుఁడు
6. కుమారసేనుఁడు ... కాశ్మీరదేశమునకు రాజు
7. చంద్రసేనుఁడు ... కుమారసేనుని పినతండ్రి
8. శంకరుఁడు ... కుమారసేనుని సేవకుఁడు
9. అమరుఁడు ... త్రిచూరు పర్వతనాయకుఁడు

### స్త్రీలు

1. సుమిత్రాదేవి ... రాణి, కుమారసేనుని సోదరి
2. ఇళాదేవి ... అమరుని కూఁతురు
3. రేవతి ... చంద్రసేనుని భార్య

---

# రాజు - రాణి

---

## ప్రథమాంకము

రంగము : రాజ మందిరోద్యాన వనము.

(విక్రమసింహుఁడు, సుమిత్రా దేవి ప్రవేశింతురు.)

విక్రముఁడు : ప్రేయసీ ! నా కడ కఱుదెంచుటకు ఇంతాలస్య మేల చేసితివి ?

సుమిత్ర : నాథా ! నే నెటనున్నను మీ దాననే గదా. మీ గృహము, గృహకృత్యములు నన్ను మీ సన్నిధినుండి దూరము చేసినవే గాని మీనుండి కాదు.

విక్రముఁడు: ఆ గృహము, గృహకృత్యములు అటుండనిమ్ము. నిన్నిలోకవృత్తమునకు వదలి యొక్క-క్షణమైన నుండ లేను. నా హృదయములో దప్ప నీ కీ లోకమం దెక్క-డను చోటుండరాదు.

సుమిత్ర : అది కాదు, రాజా ! మీ ప్రియురాలుగా మీ హృదయములోను, మీ రాణిగా ఈ లోకములోను నాకు స్థానమున్నది.

విక్రముఁడు : అయ్యో! ప్రియా! మనము మొదట ప్రేమతో కలసికొన్నప్పటి నిర్మలానంద దినము లిప్పు డెటు మాయమైనవో గదా! ఆనాఁడు మన లోక మింకనూ కనులు దెఱవలేదు. ప్రథమ సమాగమ ప్రణయానురాగమే అరుణ రాగమై మన హృదయములలో వెల్లువయై నిశ్శబ్దముగ నుదయించినది. కుసుమదళాగ్రమున హిమకణము కరణి నీ

కనురెప్పలలో తీయని నునుసిగ్గు దొంతరలు తొణికిసలాడెను; చిఱుగాలిలో రెపరెపలాడు సంధ్యాదీపమువలె నీ యరుణాధరములపై చిఱునవ్వు చిందులాడెను. అరుణోదయమున విడువలేక విడువలేక విడిచిపోవునప్పుడు నీ వొసంగిన గాఢాలింగనములను, నీ యలసయానమును మఱతుమన్నను మఱువఁజాలను. ఈ గృహము, దాని సేవ, ఈ బరువు బాధ్యతలు అప్పు డేమాయెనో కదా!

సుమిత్ర : మన మప్పుడు కేవలము బాలబాలికలకంటె పెద్దవారము కాము; మఱి యీనాఁడు నీవు రాజువు, నేను రాణిని.

విక్రముఁడు : రాజు! రాణి! వట్టి పేర్లు మాత్రమే. మన మంతకన్న యధికులమైన ప్రేమికులము.

సుమిత్ర : నన్ను మీ రాజ్యాధికారమునకన్న అధికురాలిని జేసి యవమానింపకుఁడు.

విక్రముఁడు : ఐన నా ప్రేమతో నీకుఁ బనిలేదా?

సుమిత్ర : నాపై మీ కుండు ప్రేమను వృథాచేయకుండుటయే నన్ను నిజముగా ప్రేమించుటయగును; నిజము నిరాడంబరముగ నుండగలుగుటయే దానికి కారణము.

విక్రముఁడు : స్త్రీహృదయ మగాధము, అగోచరము.

సుమిత్ర : నాథా! పొదుపులేక మీ ప్రణయ సర్వస్వమూ నాపై వెదజల్లినచో ఆవల నాకిఁక మిగులన దేమో మీరే చెప్పుఁడు.

విక్రముఁడు : దేవీ! అర్థరహితమైన ఈ మాటల నాపివేసి జీవిత మాధుర్యమును జుఱ్ఱుకొనుము. పక్షిగూళ్ళ

ప్రేమతో నిండి నిశ్శబ్దముగ నున్నవి. పెదవుల పెదవులపై కాపుంచి మాటల సందడి చేయకుము.

(పరిచారకుఁడు ప్రవేశించును.)

పరిచారకుఁడు: ప్రభూ! అత్యవసరమైన రాచకార్యమునుగూర్చి చర్చించుటకై మంత్రిగారు తమ దర్శనము వర్థించుచున్నారు.

విక్రముఁడు: ఇప్పుడు వీలుకాదని చెప్పుము, పొమ్ము.

(పరిచారకుఁడు పోవును.)

సుమిత్ర: ఆర్యా! మంత్రిగారిని రమ్మనుఁడు.

విక్రముఁడు: రాచకార్యములు వేచియుండఁగలవు. అవి యనుదిన గండములు. కాని మృదుమధురమైన విశ్రాంతి యెన్నఁడోగాని లభించదు. విశ్రాంతికూడ విధిలోని విభాగమే.

సుమిత్ర: మిమ్ము బ్రతిమాలుకొందును, మీ పని చూచుకొనుఁడు.

విక్రముఁడు: మఱల మొదలా కఠినాత్మురాలా! నీ కయిష్టమైన నీ యనుగ్రహమును రవ్వరవ్వ సంపాదించుకొనుటకై నిన్ననవరతము అనుసరించుచున్నాననుకొంటివా? నిన్ను విడిచిపోయెదను జూడుము. (వెళ్ళును.)

(దేవదత్తుఁడు ప్రవేశించును.)

సుమిత్ర: ఆర్యా! సింహద్వారము కడ ఆ కల కల మేమిటి?

దేవదత్తుఁడు: అదాఁ— నన్నాజ్ఞాపింపుము, మహారాణీ! ఆ ఆకలి మూకను రాజభటులచేఁ దఱుమగొట్టించెదను.

సుమిత్ర: వెక్కిరింపక ఏమి జరిగినదో చెప్పుము.

దేవదత్తుఁడు: ఎబ్బే! ఏమియును లేదు. అది సాక్షాత్తు ఆఁకలి దేవత అవతారము; నిజముపేదల కటిక ఆఁకటి మంట. బక్కచిక్కిన యీ అల్లరిమూక కాకిగోలలతో మీ ప్రమదా వనములో హాయిగా నిదురించు జంట కోకిలల బెదరఁ గొట్టు చున్నది.

సుమిత్ర: తండ్రీ! ఆఁక లెవరికో వివరముగఁ జెప్పుము.

దేవదత్తుఁడు: ప్రజలకు, అది అయినా వారి కర్మ. ఈ దేశములో పేదప్రజలు చిరకాలమునుండి యర్ధకడుపులతోఁ గడుపుచున్నారే కాని యింకను పూర్ణోపవాసములు చేయలే కున్నారు. ఇది చిత్రమే.

సుమిత్ర: ఇదేమి చిత్రము! దేశము సస్యశ్యామలమై అలరారుచున్నదే; ఎటుజూచినను ధాన్యలక్ష్మి కలకలలాడు చున్నదే; ప్రజ లాకలితో చావవలసిన కర్మమేమి?

దేవదత్తుఁడు: దేశ మెవ్వనిదో ధాన్యమతనిదే కాని పేద ప్రజలది కాదు. రాజులు విందులొనర్చుకొనుచుండ ప్రజలు కుక్కలవలె ఎంగిలిమెతుకులకై ఎగబడుచున్నారు. తుదకు వారు తినునది తన్నులో, మెతుకులో తెలియదు.

సుమిత్ర: అయిన నీ దేశమునకు రాజనువాడు లేడా?

దేవదత్తుఁడు: ఒకఁడా, వందలకొలది రాజులున్నారు.

సుమిత్ర: రాజోద్యోగులు అప్రమత్తులై లేరా? వారి పరిస్థితుల గమనించుటలేదా!

దేవదత్తుఁడు: మీ రాజోద్యోగుల నెవరేమన గలరు? పరదేశమునుండి పై బట్టతో పొట్టచేత బట్టుకొనివచ్చినది వట్టి చేతులతోఁ బ్రజల దీవించి పోవుటకా?

సుమిత్ర: పరదేశమునుండియా? వారు నా బంధువు లేనా?

దేవదత్తుఁడు: ఔను, మహారాణీ!

సుమిత్ర: జయసేనుని సంగతి చెప్పుము.

దేవదత్తుఁడు: అతఁడు సింహఘుర రాష్ట్రమును బాలించుచున్నాఁడు. రాజ్యపాలనమున నాతని యప్రమత్తత అతి సమర్థమైనది, సున్నితమైనది. ప్రజల అన్నవస్త్రముల నాతఁ డూడ్చ్వగా వారికిఁక మిగిలినవి అస్తులూ, పస్తులే.

సుమిత్ర: మణి శీలుని సంగతి?

దేవదత్తుఁడు: అతఁడు వాణిజ్యముపైఁ గనులుంచి వ్యాపారుల యధిక లాభ భార విముక్తులఁజేసి యా భార మంతయు తన విశాల భుజస్కంధములపై వేసికొనుచున్నాఁడు.

సుమిత్ర: అజితుఁడో?

దేవదత్తుఁడు: విజయకోట నేలుచున్నాఁడు. ఎత్తిన చేయి దించక అభయ విశ్వాసముతో పండిన నేల మూఁపున నవ్వుచూ నిమిరి చేతికిఁ జిక్కినదంతయు జాగ్రత్తగ చేర్చు కొనుచున్నాఁడు.

సుమిత్ర: అయ్యో! ఎంతటి యవమానకరము! స్వార్థపరులగు నీ దేశద్రోహులను రాజ్యమునుండి పాఱద్రోలి వీడితి ప్రజల రక్షించెదను. మహారాజుగారు వచ్చుచున్నారు. ఇఁక బొమ్ము. (దేవదత్తుఁడు పోవును. రాజు ప్రవేశించును.) నేను నా ప్రజలకు తల్లిని, వారి మొఱ వినలేను. రాజా! వారిని రక్షింపుము.

విక్రముఁడు: నన్నేమి చేయమందువో చెప్పుము.

సుమిత్ర: దేశమును బీడించువారిని వెళ్లఁగొట్టఁడు.

విక్రముఁడు: అది నాకుఁ దెలియును గాని వారెవరో నీకుఁ దెలియునా ?

సుమిత్ర: వారెవరైన నాకేమి?

విక్రముఁడు: వారు నీ దాయాదులు,

సుమిత్ర: ఔ గాక. కన్నబిడ్డలవంటి ప్రజలకంటె నాకు వారెక్కువకాదు. వారు చోరులు. మీ పేర దేశమును దోచుకొనుచున్నారు.

విక్రముఁడు: ఆ చోరులెవరో కారు నీ జ్ఞాతులగు జయసేనుఁడు, శీలుఁడు, అజితుఁడు.

సుమిత్ర: మన దేశము వారి బారినుండి తప్పించుకొనవలెనన్న వారీ దేశమునుండి వెడలిపోవలెను.

విక్రముఁడు: తిన మఱిఁగిన వారూరక పోయెదరా ? యుద్ధముసేయక వారు కదలరు.

సుమిత్ర ఐనచో యుద్ధము చేయుఁడు. వారిని జయించి దేశమునుండి పారద్రోలుఁడు.

విక్రముఁడు: యుద్ధమా ? ముందు నిన్ను జయింపనిమ్ము. తర్వాత శత్రువుల జయించుటకు నాకు తీరిక దొరుకును.

సుమిత్ర: రాజా! శత్రువుల జయింప మీకు శక్యము గానిచో మీ రాణినైన నాకు అనుజ్ఞ ఇండు, నేనే ప్రజల రక్షించెదను. (పోవును.)

విక్రముఁడు: (స్వగతము.) ఇట్లేల నా హృదయము నాందోళ పఱతువు. నేనందుకో లేనంత ఎత్తులో నీ ఔన్నత్య

మునే పర్వత శిఖరముగా చేసుకొని వానిపైకెక్కి యొంటరిగ కూర్చుందువు. నేను నిన్ను జేరలేను. నీవు నీ యాదర్శ సాధనకై యెక్కడికో పోయెదవు; నేను నిన్ను వెదకి వెదకి నిష్ఫలుడ నయ్యెదను.

(దేవదత్తుఁడు ప్రవేశించును.)

దేవదత్తుఁడు: మిత్రమా! మహారాణిగారేరీ? పాపము, మీ రొంటరిగ నుంటిరేల?

విక్రముఁడు: బాపఁడా! ఇదంతయు నీ పన్నాగమే. రాణితో రాజకీయములు ముచ్చటించుటకా నీ విచ్చటికి వచ్చినది. ఈ దేశవార్తల నామె చెవికి నిన్నెవరు దెమ్మనిరి?

దేవదత్తుఁడు: నా యవసరములేకయే ప్రజల ఆర్తనాదములే దేశవార్తల నామె వీనుల వేసినవి. మీ విశ్రాంతికి భంగము కలుగునని యైనను వారు లక్ష్యపెట్టరైరి. పరిస్థితు లంతవఱకు వచ్చినవి. నన్నుజూచి భయపడకు, రాజా! రాణిగారి వద్దకు నా దిన వెచ్చముడుగ వచ్చితిని. వంటింట కుండలు వట్టివగుటచే నా భార్య చిరబుర లాడుచున్నది. ఇంటిలో కావలసినన్ని పడ కవులున్నవి. వాటి యాకటి మంట వట్టికుండలనే దిగమ్రింగునట్లున్నది. (వెళ్లును.)

విక్రముఁడు: (తనలో) నా ప్రజల సుఖమును గోరుట నా ధర్మము. నా రాజ్యములో అన్యాయములు, అక్రమములు ఉండరాదు. నిర్భాగ్యుల యల్పసుఖములపై శ్రీమంతుల శీత కన్నుల పడనీయరాదు. (మంత్రి ప్రవేశించును.) మహామంత్రీ! తక్షణమా విదేశ చోరుల దఱుమఁగొట్టించుము.

ఇంక నొక్కదినమైనను బాధిత ప్రజల రోదన ధ్వని నే వినరాదు.

మంత్రి: నిజమే ప్రభూ! కాని చాలకాలమునుండి వ్రేళ్లు పాతుకొనిపోయి చల్లగాఁ బెఱిగిన ఈ విషవృక్షమును ఒక్క దినములో నిర్మూలింపలేము.

విక్రముఁడు: దాని మూలముపై బలమైన గొడ్డలి పెట్టు పెట్టి వంద వత్సరములగా పెఱిగిన యీ విష వృక్షమును ఒక్కరోజులో కూల్చివేయుఁడు.

మంత్రి: అందురు తగిన ఆయుధములు సైనికులు కావలెను.

విక్రముఁడు: మా సేనాధిపతి నడుగుము.

మంత్రి: అతఁడు కూడ విదేశీయుఁడే.

విక్రముఁడు: అటులైన అన్నార్తుల నాహ్వానింపుము. ధాన్యాగారముల దెరిపించి యన్నముతో వారి యాకలి మంటలఁ జల్లార్పుము. ధనాగారముల దెరిపించి వారికిఁ గావలసినంత ధనమిచ్చి పంపుము—అంతతో గూడ వారు తృప్తిపడక నా రాజ్యమును బంచుకొన గోరినచో ప్రశాంతముగ పంచుకొని సుఖింపమనుము. (రాజు వెళ్లును.)

(సుమిత్రాదేవి, దేవదత్తుఁడు ప్రవేశింతురు.)

మంత్రి: వందనము, మహారాణీ!

రాణి: వందనము, మహామంత్రీ! మన దేశములో ఈ దైన్యస్థితిని సహించి యూరకుండరాదు. సత్వరమే పరిస్థితి నదుపులోనికి దేవలెను.

మంత్రి: అందులకేమి సేయవలెనో ఆజ్ఞాపింపుడు.

రాణి: విదేశీయులైన మన సామంతులనెల్ల వెంటనే రాజధానికి రమ్మని నా యాజ్ఞగా వారికిఁ దెలియఁజేయుఁడు.

మంత్రి: నేనిదివఱకే యట్లొనర్చితిని. తిరస్కరించుదను భీతిచే రాజుగారి నడుగకయే రాజుపేరున నేనే వారిని రాజధానికి రమ్మని యాహ్వానించితిని.

రాణి: వార్తాహరులఁ బంపి యెన్నాళ్లయినది ?

మంత్రి: నెలదినములు కావచ్చినది. ప్రత్యుత్తర ములకై ప్రతిక్షణము నిరీక్షించుచున్నాను. కాని, వారసలు జవాబీయరేమో యని సంశయముఁగ నున్నది.

రాణి: రాజుగారి పిలుపునకే జవాబీయ రందురా ?

దేవదత్తుఁడు: ఈ రాజుగారొక పెద్ద పుకారు పుడకై నారు. వారి వారి యిష్టానుసారమది వారు నమ్మవచ్చును; నమ్మకపోవచ్చును.

రాణి: సచివోత్తమా ! వారి నెదిరింప మన సైనికుల సిద్ధము చేయుము. వారు నా బంధువులైనందున నాకు జవాబు చెప్పవలసి యున్నది.

మంత్రి: చిత్తము. (పోవును.)

దేవదత్తుఁడు: మహారాణీ ! మీరు పిలిపించిననూ వారు రారు.

రాణి: అప్పుడు రాజు వారితో యుద్ధము చేయును.

దేవదత్తుఁడు: రాజు యుద్ధము చేయఁడు.

రాణి: అయితే నేను జేసెదను.

దేవదత్తుడు: నీవా !

రాణి: అవును. కాశ్మీర రాజగు నా సోదరుఁడు

కుమారసేనుని దగ్గఱకుపోయి, ఆతని సహాయముతోఁ గాశ్మీర దేశమున కవమాన కరులగు నీ తిరుగుబాటుదారులతో యుద్ధముచేసి యోడించెదను. తండ్రీ! ఈ రాజ్యమునుండి తప్పించుకొనిపోవుటకు సాయము చేయుము. పరిస్థితులు విష మించినచో నీ ధర్మమును నీవు నెరవేర్పుము.

దేవదత్తుఁడు: నీ ధర్మదీక్షకు మెచ్చుకొన్నాను. నీవు నిజముగా ప్రజల తల్లివి. నీకు నా నమస్కారములు. (పోవును.)

(విక్రమసింహుఁడు ప్రవేశించును.)

విక్రముఁడు: నన్ను విడిచి వెళ్లెదవేల రాణీ! నా మనస్సులోని కోరికను ఉన్నదున్నట్లు నీ ముందుంచినందులకా నన్నొగతాళిచేసి పోయెదవు.

సుమిత్ర: రాజు హృదయము ప్రజలందఱిదీ. దానిని నేనొక్కతెనే పంచుకొన సిగ్గుపడుచున్నాను.

విక్రముడు: కనులు తిరిగే యెత్తున నీవున్నావనీ, కనుల కగపడనంత క్రింద నేనున్నాననీ నీవనుకొనుట నిజముకాదు. నా శక్తి నాకుఁ దెలియును. నా ప్రకృతిలోనున్న అజేయ మైన శక్తిని నీపై ప్రేమగా మార్చితిని.

సుమిత్ర: రాజా! నన్ను మీరెంత ద్వేషించినను, చివరకు మఱచినను ధైర్యముతో సహించెదనుగాని మీ పౌరుష మును ఒక స్త్రీ సౌందర్యముకొఱకై నిర్వీర్యము కావించు కొనుట భరింపలేను.

విక్రముఁడు: నాపై నీకంత ప్రేమ యుండియు, ఇంత అవజ్ఞయా? నీ నిరాదరణ కఱకు కత్తివలె నా హృదయమును

జీల్చి వేడి రక్తముగారుచు ప్రేమను వెలికిదీసి, మట్టిలో గొట్టు చున్నది.

సుమిత్ర: (రాజు పాదములపైబడి) ప్రాణప్రియా! మీ పాదములంటి విన్నవించెదను. మీరు మీ రాణి తప్పుల నెన్నిసారులు క్షమించలేదు. మఱి యిప్పుడెందుకిట్లు నిర్దోషి నైన నాపై నిష్కారణముగ మండిపడుచున్నారు.

విక్రముడు: (ఆమెను లేపుచూ) లెమ్ము. ప్రేయసీ! నా హృదయ సీమకు రమ్ము. నీ కోమల బాహులతలచే నన్ను జుట్టివేసి యొక్క క్షణకాలము సర్వమూ మఱపింపఁ జేయుము.

(మహారాణీ యని పిలిచిన శబ్దము బయటనుండి వినఁబడును.)

సుమిత్ర: ఆ స్వరము దేవదత్తునిదే. తండ్రీ! సందేశ మేమో వచ్చి తెలుపుము. (దేవదత్తుఁడు ప్రవేశించును.)

దేవదత్తుఁడు: విదేశీయులైన మన రాష్ట్రాధిపతులు రాజు పిలుపును ధిక్కరించిరి. అంతేకాదు తిరుగుబాటుకు కూడ తయారగుచున్నారట.

సుమిత్ర: విన్నారా, మహారాజా!

విక్రముడు: బ్రాహ్మణుఁడా! రాజకీయముల చర్చించుట కీ రాజోద్యానము సభామందిరము కాదు.

దేవదత్తుఁడు: ఆర్యా! మేమా సభామందిరమున మా రాజును జూచుటరుదు, ఏలయన యది రాజోద్యానముకాదు.

రాణి: ఈ హీనజాతి కుక్కలు రాజుగారి విస్తర విదుపులఁ గడుపారఁ గుడిచి, వళ్లు బలిసి, సాకిన యజమానినే కఱువ సాహసించినవే. రాజా! సభామందిరమున గూర్చుండి

చర్చించుట కిది సమయముగాదు. మీరు చేయవలసిన కార్యము ముకురములో ముఖమువలె విశదముగ కానవచ్చు చున్నది. సేనలఁబంపి యా తుంటరుల నణఁగఁ ద్రొక్కింపుఁడు.

విక్రముఁడు: మన సేనా నాయకుఁడే విదేశీయుఁడు.

రాణి: అట్లైన మీరే స్వయముగ వెళ్లుఁడు.

విక్రముఁడు: నేను నీ దురదృష్టమునా, నీకు దుస్స్వప్న ముగఁ దోఁచితినా? రాణీ! ఊహుఁ! నే నొక్క యడుగైన గదలను. శత్రువులతో సంధి చేసికొందును. ఈ చెఱుపున కంతయు కారకులెవ్వరు? ఈ బ్రాహ్మణుఁడూ, ఈ స్త్రీ యిరువురు కలసి కుట్రచేసి పుట్టలో నిద్రించు పామును లేవఁ గొట్టిరి. ఆత్మరక్షణ కావించుకొనలేని యసమర్థులు అనాలో చితముగ అన్యుల కాపదలు ఘటింతురు.

రాణి: అయ్యో! దౌర్భాగ్యపు దేశమా! అట్టి దేశ మునకు రాణినైన ఓ దురదృష్టవంతురాలా! మీ భవితవ్య మెట్లున్నదో కదా? (పోఁబోవును.)

విక్రముఁడు: ఎక్కడికి పోవుచున్నావు?

రాణి: నిన్ను వదలుటకు.

విక్రముఁడు: నన్ను వదలుటకా?

రాణి: అవును. విద్రోహులను బాఱద్రోలుటకు.

విక్రముఁడు: నీ వబలవు, అసహాయవు. నీకు నాతో పరిహాసమా?

రాణి: సెలవు, నే బోయి వచ్చెదను.

రాజు: నన్ను వదలిపోలేవు సుమా.

రాణి: మీ పతనమును జూచుచు మీ వద్దనే యుండ లేను.

రాజు: పొమ్ము, గర్విష్ఠురాలా! నిన్నిఁకఁ దిరిగి రమ్మనను. నా సహాయము నర్థింపకుందువు గాక. (రాణి పోవును.)

దేవదత్తుఁడు: రాజా! ఆమె నొంటరిగ బోనిచ్చెదరా?

రాజు: మిత్రమా! ఆమె నిజముగా పోవుటలేదు. ఆమె మాటలలో నాకు విశ్వాసము లేదు.

దేవదత్తుఁడు: లేదు, రాజా! ఆమె పట్టుదలగ నున్న ట్లున్నది.

రాజు: వెఱ్ఱి బాపనయ్యా! ఆడవారి మాయలు నీ వెఱుఁగవు. నన్ను కార్యతత్పరునిఁ జేయుటకై బెదిరించు చుండును కాని యామె పద్ధతుల నేను ద్వేషింతును. నా ప్రేమతో చెలగాట మాడవచ్చు ననుకొనుచున్నది. దాని కామె పశ్చాత్తాప పడక తప్పదు. అయ్యో! వయస్యా! ప్రేమకూ-ప్రభువుకూ చాలదూరమను గుణపాఠమును చివరకు నేను ప్రేమించిన నా భార్యవద్దనా నేర్చుకొనవలసివచ్చుట? దేవదత్తా! మన మాబాల్యమిత్రులము. నేను రాజునన్న విషయమును క్షణముసేపు మఱచిపోలేవా? నాదీ మానవ హృదయమేననీ, సకల మానవ హృదయములవలెనే నా హృదయమూ బాధపడుననీ గుర్తించలేవా?

దేవదత్తుఁడు: మిత్రమా! నా హృదయము నీది. అది నీ యాగ్రహానుగ్రహముల నేక రీతిగా గ్రహింప సిద్ధముగ నున్నది.

రాజు: అటులయిన ఈ ఆగ్రహోద్రేకమును మా హృత్స దనమున కేల యాహ్వానించితివి ?

దేవదత్తుఁడు: నీ యింటికి నిప్పంటుకొన్నది. నిన్ను నిద్రలేపి నీకా సంగతి చెప్పితిని. అదికూడ తప్పా ?

రాజు: లేపి మాత్రము ప్రయోజనమేమి ? బ్రతుకు బాటలలో అన్నియూ కలలే యైనప్పుడు నాకు నచ్చిన చిన్ని కలనెన్నుకొని సుఖించి చావనిమ్ము. ఏఁబది యేండ్ల తర్వాత ఈ క్షణమందనుభవించిన సుఖదుఃఖము లెవ్వఁరికి జ్ఞాపక ముండును. సర్వమూ చెరిగిపోవునదే. దేవదత్తా ! అనిర్వాచ నీయమైన ఈ బాధనంతయు నన్నే అనుభవింపనిమ్ము. పొమ్ము. (దేవదత్తుఁడు పోవును.)

(విదేశీయుఁడైన ఒక రాజ సర్దారుఁడు ప్రవేశించును.)

సర్దారుఁడు: నమస్కారము మహారాజా ! మాకు న్యాయము ప్రసాదింపుఁడు.

రాజు: మీకుఁ జరిగిన అన్యాయమేమిటో మొదటఁ జెప్పుము.

సర్దారుఁడు: మేము మహారాణీగారితో యీ దేశమునకు వచ్చితిమి. మేము పరదేశస్థులమన్న కారణముచే గిట్టనివారు మీతో మా మీద అసత్యారోపణలు కావించిరని వింటిమి.

రాజు: ఆ యారోపణలు నిజముకావని యెవరెఱుఁగు దురు ? ఐనను, మీపై మాకు విశ్వాసమున్నంతవఱకు నిశ్చింతగ నుండలేరా ? చిన్నమంత అనుమానముతో మిమ్మెన్నడైన అవమానించితినా ? ఈ అవమానములు పిఱికి పందల పుచ్చిన గుండెలలో చెదపురుగులవలె పుట్టి

పెరుగును. రాజద్రోహమన్న మాకు నిర్భయము. అవలీలగా దాని నణఁగద్రొక్కఁగలము. కాని మా మనస్సులో నైచ్యమునకు లఘుత్వమునకుఁ దావీయము. తమరింక దయ చేయవచ్చును. (సర్దారుఁడు పోవును.)

(మంత్రి, దేవదత్తుఁడు ప్రవేశింతురు.)

మంత్రి: ప్రభూ! మహారాణిగారు——

రాజు: ఏమైనది?

మంత్రి: గుఱ్ఱముపై నెక్కి యంతఃపురము వదలి పోయినది.

రాజు: ఆఁ! ఏమంటివి? అంతఃపురము వదలి పోయినదనా?

మంత్రి: చిత్తము.

రాజు: నీవేల ఆపలేదు?

మంత్రి: ఆమె రహస్యముగ వెళ్లినది.

రాజు: నీకీ వార్త నెవరు తెల్పిరి?

మంత్రి: రాజప్రాసాదములోని దేవాలయము మీదుగా ఆమె గుఱ్ఱముపై స్వారిచేయుచు పోవుచుండ మన పూజారి చూచినాడట.

రాజు: పూజారిని బిలువనంపుము.

మంత్రి: దేవా! ఆమె చాలదూరము పోయియుండదు. ఇప్పుడే వెళ్లినది. ఇప్పటికైనను మీరామెను వెనుకకుఁ దెప్పింపవచ్చును.

రాజు: తెప్పించుట ముఖ్యవిషయము కాదు. నన్ను తప్పించుకొనిపోవుటయే గొప్ప సంగతి. అనేకమంది సైనికులు,

అభేద్యములైన కోట గోడలు, కఠిన కారాగారములు, శృంఖల ములు ఒక్క చిన్న స్త్రీ హృదయమును బంధించి యుంచఁ జాలకపోయినవి.

మంత్రి: అయ్యో! ప్రభూ! గట్టుతెగిన ప్రవాహము వలె నలువైపులనుండి యపనింద రాక మానదు.

రాజు: అపనిందయా? నిందించిన వార నాల్కలే చెడును.

దేవదత్తుఁడు: గ్రహణకాలమున మనుష్యులు మసి పూసిన గాజు పెంకులగుండ మధ్యందిన మార్తాండుని సైతము జూతురు. మహారాణీ! నీ పేరు ఆ నోట యీ నోటఁబడి కళంకితమయినను నీ కీర్తి మాత్రము యకళంకమై దశ దిశల ప్రకాశించును.

రాజు: మంత్రీ! పూజారిని బిలుచుకొనిరండు. (మంత్రి పోవును.) ఇప్పటికైనను నే నామెను వెదుకఁబోయి వెనుకకుఁ దేవచ్చును. కాని యామె ఎప్పుడూ నన్ను దప్పించుకొని తిరుగుటయు, నే నామెను దఱుముకొని పోవుటయు ఇదేనా నా యెడతెగని పని? రేయింబవలనక, ఇల్లు వాకిలి వదలి, ప్రేమకు దూరమై విధి విరామములేక పారిపోమ్ము. చంచలా! పారిపోమ్ము. (పూజారి ప్రవేశించును.) పో పొమ్ము, కావలసినంత విన్నాము. ఇఁక వినదలచుకొనలేదు. (పూజారి పోఁబోవును.) రా, రమ్ము; ఒక్క సంగతి చెప్పుము. నా రాణి ఆలయము వద్ద దిగి కన్నీటితో ప్రార్థింపవచ్చెనా?

పూజారి: లేదు, మహారాజా! క్షణము సేపు గుడ్డిము

నాపై యాలయమువైపు మొగమ్ముద్రిప్పి తలవంచి నమస్కరించినది. తోడనే హాయము నదిలించి . ఫైబఅపుత్రీగవలె మాయమైపోయినది. ఆమె కన్నులలోఁ గన్నీటి బిందువు లున్నదీ లేనిదీ చెప్పలేను. ఆలయ దీపము కాంతిహీనమై యుండెను.

రాజు: ఆమె కన్నులలోఁ గన్నీరా? అంత కఠినుర్తాలని నీ వూహించియైన నుండఁజాలవు. విన్నది చాలు యిఁకఁ బోయి రమ్ము. (పూజారి పోవును.) హా, దైవమా! ఆమెను ప్రేమించుటే నే నామెకుఁ జేసిన మహాపరాధమని నీ వెఱుంగుదువు. ఆమె ప్రేమకొఱకై నా సర్వసుఖములను, నా రాజ్యమునైనను త్యజింప నిష్టపడితిని. చివరకవి నన్ను మోసగించలేదు; ఆమెయే నన్ను మోసగించినది.

(మంత్రి ప్రవేశించును.)

మంత్రి: ప్రభూ! నివ్వుగారైన అశ్వికుల నామెను వెంటాడఁ బంపితిని.

రాజు: వారిని వెంటనే వెనుకకుఁ బిలువనంపుము. ఆ కల ఎగిరిపోయినది. అశ్వికులా కల నెక్కడఁ గనుఁగొందురు? మన సైన్యము నాయత్తము చేయుము. నేనే స్వయముగా యుద్ధమునకుఁబోయి విప్లవము నణచివేసెదను.

మంత్రి: చిత్త మట్లే చేసెదను. (వెళ్లును.)

విక్రముఁడు: దేవదత్తా! ఏల్లు ఊరక దిగులుపడి కూర్చుంటివి? ద్రోహము సాతిపోయెను. కొల్లగొట్టిన ధన మెక్కడనే క్రిందిగవిడిచి పోయెను. ఆ ధనమిప్పుడు నాకు

దొరికెను. అదే నా స్వేచ్ఛాధనము. ఇది నాకు సంతోష సమయము........అయ్యో మిత్రమా! నా మాటలు కృత్రిమములు. క్రూరమైన ఈ బాధ కత్తివలె నా గుండెలోఁ గ్రుచ్చుకొనిపోవుచున్నది.

దేవదత్తుఁడు: బాధకుగాని, ప్రేమకుగాని నీకిప్పుడు వ్యవధి లేదు. నీ జీవితమొక కార్యప్రవాహమై నీ ధీర హృదయమును దిగ్విజయ యాత్రకైఁ దీసికొనిపోవలెను.

విక్రముఁడు: నా హృదయ మింకను అస్వస్థముగ నున్నది. ఈ లోకము తన ప్రియుఁడు కాడనీ, పురుష హృదయమే స్త్రీకి యేకైక లోకమనీ తెలుసుకొన్న తర్వాత, నా రాణి నా చెంతకు త్వరలోనే తిరిగి రాగలదనీ నాకింకనూ విశ్వాసమున్నది. కాలఁదన్ని పారవేసిన వస్తువు విలువ అది కావలసిననాఁడు తెలిసికొనగలదు. ఆమె గర్వము నశించి తిరిగివచ్చి నన్నమితముగ ప్రేమింప నారంభించినప్పుడు నాకు సమయము దొరుకును.

(సేవకుఁడు ప్రవేశించును.)

సేవకుఁడు: దేవా! మహారాణిగారీ యుత్తరమును దమకీయమనిరి. (ఉత్తరమిచ్చి వెళ్లును.)

రాజు: చేసినపనికి చింతింప నారంభించినది. (జాబు చదువుకొని) ఇంతేనా! రెండే రెండు పంక్తులు. నా రాజ్యము లోని విప్లవము నణఁచుటకై కాశ్మీరదేశ రాజగు తన సోదరుఁడు కుమారసేనుని సహాయ మడుగఁ బోవుచున్నానని వ్రాసినది. ఇది తీరని యవమానము! కాశ్మీరమునుండి సాహాయ్యమా!

దేవదత్తుఁడు: వెంటనే మీరీ విప్లవము నణచిఁవేసి యామె యత్నమును వమ్ము చేయుఁడు. అదే మీ ప్రతీకార మగును.

రాజు: నా ప్రతీకారమా? నీవు చూతువు గాక.

---

## ద్వితీయాంకము.

రంగము: కాశ్మీరములో యుద్ధ శిబిరము.

(విక్రమసింహుఁడు, సేనాధిపతి ప్రవేశింతురు.)

సేనాధిపతి: ప్రభూ! తమ రాజ్యక్షేమమునకై సలహా చెప్ప సాహసించినందులకు క్షమింప వేడెదను.

విక్రముఁడు: చెప్పుము.

సేనాధిపతి: మన దేశములో చెలరేగిన విప్లవము నణచివేసితిమి. ఆ విప్లవకారులే యిప్పుడు మన పక్ష మవలంబించి పోరాడుచున్నారు. రాజధానిలోఁ దమరుండవలసిన తరుణమున యిక్కడ ఈ కాశ్మీరములో మన బలమూ, కాలమూ వ్యర్థము చేయనేల?

విక్రముఁడు: ఇచ్చట పోరాటమింకను ముగియలేదు.

సేనాధిపతి: మహారాణి సాహసమునకు ఆమె సోదరుడగు కుమారసేనుఁడు శిక్షింపఁబడెను. ఆతని సైన్యము సర్వనాశనమయ్యెను. బ్రతుకు జీవుఁడాయని ప్రాణము లరచేత బట్టుకొని యెక్కడనో తలదాచుకొని యున్నాఁడు; అతని పినతండ్రి చంద్రసేనుఁడు కాశ్మీర సింహాసన మధిష్టింప ద్వరపడుచున్నాఁడు. చంద్రసేనుని రాజుగా చేసి యీ దౌర్భాగ్య దేశమును వదలిపోవుదము.

విక్రముఁడు: శిక్షించుటకు కాదు నే నిచ్చట నిలచి యున్నది. సమరము సాగించుటకు. చిత్రకారునకు చిత్రపట మెట్లో నాకునూ ఈ సమరమట్లే యైనది. స్ఫుటమైన రేఖలఁదీర్చి, చిక్కనైన రంగులు పూసి నానాటికి విలక్షణమైన దానిగాఁ జేయవలెను. ఆ చిత్రపటము శత సహస్ర రూపముల వికసించు కొలఁది క్రమముగా నా మనస్సు దానిలో లీనమై పోవును. పని పూర్తిచేసిన తర్వాత దాని నొక నిట్టూర్పుతో వదలెదను. ఈ వినాశ మంతయు ఆ చిత్రపట సామగ్రి మాత్రమే. ఆ సామగ్రినుండియే యది సారూప్య మందును. ఇది యొక నూతన సృష్టి. పానోన్మాదము వగిదిఁ ద్రెబెలియు ప్రతి పూవును కోమలముగనుండు రక్తరంజిత పాటలీ కుసుమ గుచ్ఛమువలె యీ సృష్టి కడు మనోజ్ఞముగ నుండును.

సేనాధిపతి: కాని యిట్లింతకాలము పోరాడగలమా? మహారాజా! మీరు మిక్కిలి మీరు చేయవలసిన అవసరమైన కార్యము లెన్నో యున్నవి. ఈ యుద్ధము మన దేశమునెట్లు నాశనము చేయుచున్నదో తమ దృష్టికిఁ దెమ్మని నన్ను బ్రతిమాలుకొనుచు మంత్రిగారు వార్తలపై వార్తల నంపుచున్నారు. నా మాట లాలకించి యుద్ధము చాలింపుఁడు.

విక్రముఁడు: అతి సమర్థములైన నా భుజస్కంధముల క్రింద వర్థిల్లు ఈ మహా సమర స్వరూపము తప్ప నా కనుల కీ లోకమున మరేదియు కానరాదు. ఓహో! ఏమూ ఖడ్గ ప్రహార జనిత విలయ సంగీతము! ప్రేయురాలి గాఢాలింగనముల వలె మహా యుద్ధములు నీ యురము నొడిసి పట్టుకొనును. ఓహో! ఏమా భాగ్యము. పొమ్ము, సేనానీ! నీవు చేయ

వలసిన ఇతర కార్యములున్నవి. రణములో నీ ఖడ్గాగ్రములపైఁ బయలుదేరు తళ త్తళలే నీ చక్కని సలహాలై ప్రకాశింపఁగలవు. (సేనాధిపతి పోవును.) ఇది విముక్తి. బంధితుని స్వేచ్ఛగా వదలి బంధములే పదుగ త్తిపోయినవి. వలుచని ప్రణయాసవమునకన్న ప్రతీకారమే ఘాటైనది. ప్రతీకారమే స్వేచ్ఛ-బరువైన ప్రేమ బంధములనుండి స్వేచ్ఛ.

(సేనాధిపతి తిరిగి ప్రవేశించును.)

సేనాధిపతి: దూరమందుండి మన గుడారముపై పోక శకటము వచ్చుచున్నది. అందులో శాంతిదూత యుండవచ్చును. బండి వెంట సాయుధబలమేదియు లేదు.

రాజు: శాంతి యుద్ధానంతరము. శాంతికి సమయ మింకనూ రాలేదు.

సేనాధిపతి: తొలుత దూతను విందము, తర్వాత—

రాజు: యుద్ధము సాగింతము.

(ఒక సైనికుఁడు ప్రవేశించును.)

సైనికుఁడు: దేవా! దేవరవారి దర్శనార్థమై మహారాణిగారు వచ్చియున్నారు.

విక్రముఁడు: ఏమంటివి?

సైనికుఁడు: మహారాణిగారు వచ్చియున్నారు.

విక్రముఁడు: ఏ మహారాణి?

సైనికుఁడు: మన మహారాణి, సుమిత్రాదేవి.

విక్రముఁడు: సేనాధిపా! ఆ వచ్చినదెవ్వరో త్వరఁగ జూచి రమ్ము.

(సేనాధిపతి, సైనికుఁడు నిష్క్రమింతురు.)

రాజు: (తనలో) ఏదో ఒకవిధముగా నన్ను మెప్పించి, సంధికి యొప్పించి, యుద్ధము తప్పించ వచ్చుట కామె కిది మూడవసారి. కాని యామె ప్రయత్నములన్నియు విఫలము లైనవి. హఠాత్తుగా నిదురలేచి, యదే రాజోద్యాన వనమును, అవే పూలను, అదే రాణినీ, ప్రేమ నిశ్వాసము లతో అల్ప భోగములతోఁ గూడిన ఆ దీర్ఘ దినములనే మఱల మఱలఁ గనుఁగొనుట కివి కలలు కావు, కదనములు. నన్ను తన ప్రేమపాశములతో బంధించి యుద్ధరంగమునుండి రాజమందిరమునకుఁ దన విజయచిహ్నముగఁ గొనిపోవుటకు వచ్చినది. ఇందులకు మారామె గాలిని బట్టుకొనవచ్చును.

(సేనాధిపతి పునః ప్రవేశము.)

సేనాధిపతి: నరేంద్రా! వచ్చినది మహారాణిగారే, మిమ్ము చూడగోరుచున్నారు. మీ సమ్ముఖమునకు రాణి గారిని నిరాటంకముగ రానీయఁజాలక పోయినందులకు కుందు చున్నాను.

రాజు: స్త్రీలఁ జూచుటకిది సమయముగాని స్థలము గాని కాదని చెప్పుము.

సేనాధిపతి: కనికరించి యనుజ్ఞ యిండు.

రాజు: వీలుకాదు. మా శిబిర ద్వారమున కావలివారిని అప్రమత్తులుగ నుండ హెచ్చరింపుము—శత్రువులకైఁ గాదు, స్త్రీల కొఱకు.

సేనాధిపతి: చిత్తము. (వెళ్లును.)

(శంకరుఁడు ప్రవేశించును.)

శంకరుఁడు: నా పేరు శంకరుఁడు. కుమారసేన మహా రాజ సేవకుఁడను. నన్ను శిబిరమున బంధించిరి.

రాజు: అవును, ఆ విషయ మెఱుఁగుదును.

శంకరుఁడు: తమ దర్శనార్థమై మహారాణి శిబిరద్వార మున వేచియున్నది.

రాజు: ఇంకను దూరమున వేచియుండవలెను.

శంకరుఁడు: ఆమె మీ క్షమాభిక్ష వేడుకొనవచ్చినది; క్షమించనిచో శిక్ష నంగీకరించుటకై నను సిద్ధపడియున్నదని చెప్పుటకు సిగ్గుగా నున్నది. కారణమేమందురా తప్పంతయు తనదేనని యొప్పుకొనుచున్నది; తన సోదరుని దేశమును, సోదరుని కనికరించి విడిచిపెట్టమని నా ద్వారా దైవసమానులగు మిమ్మర్థించుచున్నది.

రాజు: అర్థించుట ఉచితమే కాని వృద్ధుడా! ఇది యుద్ధమని నీ వెఱుఁగవా? అదియునుంగాక ఈ యుద్ధము తన సోదరునితోఁగాని తనతోఁగాదు. ఆఁడదానితో నీ యుద్ధ సమస్యయొక్క యుచితా నుచితములగూర్చి చర్చించుటకు మాకు వ్యవధి లేదు. ఒక్కసారి యుద్ధమారంభించిన తర్వాత అది యుచితమైనను అనుచితమైనను తుదివఱకు కొనసాగించుట పురుష ధర్మమని పురుషుఁడవైన నీవైనను దెలిసికొనలేవా?

శంకరుఁడు: దేవా! మీ మాటలు సమంజసములేగాని మీరీ యుద్ధమును మా రాజుతోఁగాక యొక రమణితో-నదియు పరాయివారెవ్వరో గాదు మీ రాణితో సాగించుచున్నారని మీకుఁ దెలియునా? మా రాజామె పక్ష మవలంబించుట సోదర ధర్మము. మీరొక చిన్న కుటుంబ కలహమును పెద్ద

యుద్ధముగఁజేసి - దేశాంతరమునకుఁ దీసికొనివచ్చుట రాజో చితమో, పురుషోచితమో మీరే యోచించి తీర్మానింపుఁడు.

రాజు: వృద్ధుఁడా! హెచ్చరిక. నీ వాగ్ధోరణి ప్రమాద కరముగనున్నది సుమా. మీ రాజు కుమారసేనుఁడు తన అపజయము నంగీకరించి మాకు లోఁబడినప్పుడే ఈ సమస్య చర్చింపఁబడునని నా మాటగా నీవా మెతోఁ జెప్పుము.

శంకరుఁడు: ఉదయార్కుఁడు పశ్చిమ దిఙ్మండల ధూళిని చుంబించుటెంత యసంభవమో అదియు నంత యసంభవము. మా రాజు మానధనుఁడు. తన బొందెలో ప్రాణములుండగా మీకు లోఁబడఁడు, అతని యక్క యటు లెన్నటికిని జరుగనీయదు.

రాజు: ఐనచో సమరము సాగవలసినదే. ఒకానొక తరుణమున ధైర్యము ధైర్యమనిపించుకొనుటకు మాఱు మొండి పట్టుదల యనిపించుకొనును. మీ రాజు నన్ను దప్పించుకొనిపోఁ జాలఁడు. అతని నన్నివైపులనుండి మేమాక్రమించియున్నామని యతఁ డెఱుఁగును.

శంకరుఁడు: అవునవును, ఆ యాక్రమణలో గొప్ప లోపమున్నదనిగూడ యతఁ డెఱుఁగును.

రాజు: అట్లనుటలో నీ యర్థమేమి ?

శంకరుఁడు: నా యర్థమా ! మరణము—జయ సూచకమైన ఆ రాజమార్గమున మిమ్మాతఁడు తప్పించుకొని పోవును. అతని స్వభావము నాకు చిరపరిచితము, సువ్యక్తము. ఆయన మరణమందే తీరని ప్రతీకార వాంఛ నిలిచియుండును. (పోవును. సేవకుఁడు ప్రవేశించును.)

సేవకుఁడు: దేవా! చంద్రసేనుఁడు భార్యా సమేతుడై వచ్చి దేవరవారి దర్శనభాగ్యము నర్థించుచున్నాడు.

రాజు: లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవకుఁడు: చిత్తము. (వెళ్లును.)

(చంద్రసేనుఁడు, రేవతి ప్రవేశింతురు.)

రాజు: వందనములు;

చంద్రసేనుఁడు: కుమారా! చిరకాలము జీవింతువుగాక.

రేవతి: నీకు జయమగుఁ గాక.

చంద్రసేనుఁడు: ఇంతకూ మీరు కుమారసేనునికే శిక్ష విధింప నిర్ణయించితిరి?

రాజు: అతఁడు లోఁబడినచో క్షమింపఁదలచితిని.

రేవతి: ఇంతేనా! ఇంకేమియూ శిక్ష లేదా? చచ్చు క్షమాపణ చివర ఇచ్చినచో ఈ సమర సన్నాహమంతయు మెందులకో? ప్రభువులు పెరిగిన పిల్లలు కారు; యుద్ధములు పిల్లాటలు కావు.

విక్రముఁడు: దేశమును దోఁచుకొనుటగాని అపహరించుటగాని నా ఉద్దేశ్యము కాదు. నా గౌరవోన్నతులఁ గాపాడుకొనుటయే. కిరీటమును ధరించిన శిర మవమానమును భరించదు;

చంద్రసేనుఁడు: వత్సా! కుమారసేనుఁడు వయో వివేకముల బరిణితుఁడుకాఁడు. వానిని క్షమించి ప్రాణములతో విడిచిపెట్టుము. చేసిన తప్పుకు శిక్షగా సింహాసన చ్యుతిని జేయుము. లేదా దేశభ్రష్టుని గావింపుము. ప్రాణముల మాత్రము దీయకుము.

రాజు: నేనెన్నడుగాని కుమారసేనుని ప్రాణములఁ దీయ దలచలేదు.

రేవతి: మఱి యీ సైన్యములు, ఆయుధములు, యీ అట్టహాసమంతయు నెందులకు? నిర్దోషులైన సైనికులఁ జంపి దోషిని విడిచిపెట్టుటకా?

విక్రముఁడు: మీ యభిప్రాయము బోధపడలేదు.

చంద్రసేనుఁడు: ఆ! ఏమియునులేదు. ఆప్త బంధువు లగు మీకు అనవసరముగ కోపము తెప్పించి కాశ్మీర దేశమును కష్టనష్టముల పాలుచేసిన కుమారసేనునిపై కోపము పట్టలేక అట్లనుచున్నది, అంతియే.

విక్రముఁడు: అతఁడు పట్టుపడినప్పుడు చట్ట సమ్మత మగు శిక్ష విధింపఁబడును.

రేవతి: మేము వానిని దాచిపెట్టితిమని యనుమానపడ వలదని మనవి చేయవచ్చితిని. వానిని దాచిన దీ కాశ్మీర ప్రజలే. వారి పైర్లను, పల్లెలను గాల్చి ప్రజల నాఁకటి మంటలతో మలమల మాడ్చి చంపుడు. అప్పుడుగాని వా రాతని బయటఁబెట్టరు.

చంద్రసేనుఁడు: (మెల్లగా) రేవతీ! అకారణోద్రేకము హానికరము. కుమారా! మా రాజ నగరునకు రమ్ము. కాశ్మీర లక్ష్మి నీ రాకకై వేయిగన్నులతో వేచియున్నది.

రాజు: మీరు ముందుగా వెళ్లుడు. తర్వాత మిమ్ముల గలసికొందును.

చంద్రసేనుఁడు: మంచి దట్లే కానిమ్ము. పోయి వచ్చెదము. (ఇరువురు నిష్క్రమింతురు.)

రాజు: అయ్యో, రాజ్య కాంక్ష ఎంత దారుణమైనది. తల్లి బిడ్డలను తారతమ్యత గూడ లేదే. స్త్రీ హృదయము లోని దురాశా ద్వేషము లెంత భయంకరమైనవి. ఆ రేవతీ దేవి ముఖములో నా ముఖ కళవళిక లేమైన కనుగొంటినా యేమి ? నిగూఢానలముచే గనలిన ముఖవళులామె ఫాలమున గూడ కలవా ? హంతకుని కృపాణమును బోలిన ఆమె అధరాంచలముల యంత సన్నగా, వంపుగా నా పెదవు లాయెనా ? లేదు. నాది రణవాంఛగాని రాజ్యకాంక్షకాదు. దురాశా క్రౌర్యము లిందులకు కారణములు కావు. ఈ సమ రాగ్ని యడ్డులేనిదై, నరకుఁజేయనిదై, తనంత తా మండి తాను తగిలినదంతయు దహించి జ్వాలగనో బూదిగనో జేయు ప్రేమాగ్నివంటిది.

(సేవకుఁడు ప్రవేశించును.)

సేవకుఁడు: దేవా ! దేవదత్తుఁడువచ్చి తమ అనుజ్ఞకై వేచియున్నాడు.

రాజు: దేవదత్తుఁడు వచ్చెనా ? సత్వరమే లోనికిఁ బిలుచుకొనిరమ్ము—వలదు, వలదు. ఆగుము, నన్నాలోచింప నిమ్ము—ఆఁ, తెలిసినది. యుద్ధరంగమునుండి నన్ను వెనుకకు మరల్చుట కటుదెంచెను. పాటుఁడా! ఇది యొద్దుల నాశనము చేసి వఱదవలె పాఱు నీటిని నీ పొలములను దడిపి మెల్లగఁ దిరిగి పొమ్మందువా? ఆ వఱదనీరు నీ యిండ్లను గొట్టుకొనిపోయి నీ దేశమును నాశనము చేయదా? నన్నీ యుద్ధమునకుఁ బురి గొల్పినది నీవే కదా? ఈ యుద్ధ మెంత భయంకరమైనదో దాని విలయానందముకూడ నట్టిదే. దాని యాయుః పరిమాణ

మత్యల్పమైనందున స్థకోవర కవాటములఁ గూల్చి మదగజము లీల తన కొల్లధనమును భయాతురతతోఁ గూర్చుకొనుచున్నది. ఈ మహోద్వేగ మాగినప్పుడు మంచి సలహాల వంతు వచ్చును. నేనా బాపనిఁ జూడఁగూడదు.

(అమరుఁడు ప్రవేశించును.)

అమరుఁడు: దొరా! మీ యాజ్ఞానుసారము వచ్చి నాను, మిమ్ములను నా ఏలికగా నొప్పుకొనుచున్నాను.

రాజు: నీ వీ పర్వతప్రాంతమునకుఁ బెద్దవా!

అమరుఁడు: అవు దొరా! నేనీ త్రికూర పర్వతనాయ కుఁడను. మీరు రాజాధిరాజులు, నేను మీ బంటును. నా కొక కూఁతురున్నది. పేరు ఇళ. ఆ చక్కని చిన్నది తమ భార్య కాఁతగినది. ఇది ఆత్మస్తుతి యనుకొనకుఁడు. ఆమె బయట వేచియున్నది. ఈ పూవుల పుణ్యభూమి యుత్తమ కానుకగా ఆమెను తమకు సమర్పింప సెలవిండు. (వెళ్ళును.)

(పరిచారికతో ఇళాదేవి ప్రవేశించును.)

రాజు: (తనలో) ఆహా! ఈ సుందరి యాగమనమున అంధకార బంధురమై యున్న నా మానసాకాశమున అరుణో దయమైనది. (ప్రకాశముగ) కోమలీ, రమ్ము. నీ వీ రణరంగ మునుఁ బరవశముఁ జేసితివి. చివరకు యుద్ధదేవత హృదయ నిర్భేదకమగు అమోఘ శరమును కాశ్మీరము సంధించి వదలి నది. నిస్సారమగు వస్తుజాలవు జగతిలో నా కను లిన్నాళ్ళు పరిభ్రమించినవి. వాని కామితార్థ ఫలితముగా నేటికి నిన్ను గాంచుటకే ననుకొందును. నేలపైఁ జూపులఁబఱపి, మౌనముగ

నిలుచుంటివేల? నీ సర్వాంగములలో ప్రకంపితమగు అజ్ఞాతబాధ కొలదిగ జూడఁ గలుగుచున్నాను.

ఇళ: (మోకరిల్లి) మీరు మహారాజులని వినియున్నాను. నన్ను కరుణించి యొక్క వరమిండు.

రాజు: సుందరీ! లెమ్ము. నీ పాదములఁ దాకు అర్హత ఈ పృథివికి లేదు. ఈ భాగ్యమునకే ధూళిలో మోకరిల్ల వలెనా? నీవు కోరిన నేను ఇవ్వజాలని దేదియును లేదు.

ఇళ: నా తండ్రి నన్ను మీ కర్పించెను. నేను నన్ను విడువ వేడుకొనుచున్నాను. అగణితములైన సిరిసంపదలు, అపారములైన భూభాగములు మీకుఁ గలవు. నన్ని దుమ్ము లోనే వదలిపొండు; మీరు కోరవలసినది దేదియు లేదు.

రాజు: నిజముగా నేను కోరవలసిన దేదియు లేదా? నా హృదయము నీ కెట్లు చూపఁగలను? దాని సిరిసంపదలు, భూభాగములు ఎందున్నవి? నా హృదయము శూన్యముగ నున్నది. నాకీ రాజ్యము గీజ్యము లేకుండినను, నీవు మాత్ర ముండిన——

ఇళ: అయిన నన్ను మొదట జంపుఁడు. అడవి, లేడి గుండెలను మీ బాణములతో జీల్చి చంపినట్లు నన్ను గూడ జంపుఁడు.

రాజు: బాలా! నాపై నీ కింత ద్వేషమేల? నేను నీకుఁ దగినవాడనుగానా? నా బాహుబలముతో ననేక రాజ్యముల జయించితిని. నీ కోమలహృదయమును గోరఁగూడదా?

ఇళ: నా హృదయము నాది కాదు. అది యిదివఱకే ఒకరికి దత్తమైనది. తిరిగి వచ్చి, మా పురాతనారణ్య శీతల వృక్షచ్ఛాయలలో గలసెదనని వాగ్దత్తముచేసి, కొన్ని నెలల క్రింద నన్ను విడిచివెళ్ళిన నా ప్రియున కీ హృదయమును దత్తము చేసితిని. నా స్వామికై నా ప్రేమను మీఁదు కట్టితిని. ఆయన రాకకై ఎదురు తెన్నులు గాయుచుంటిని. దినములు నిర్దాక్షిణ్యముగ దొరలిపోవుచున్నవి; ప్రియుని రాకకై కాచి కాచి నా కన్నులు కాయలు కాయుచున్నవి; యీ అరణ్యము గంభీరమై అగమ్యగోచరమగుచున్నది. నన్ను మీరు స్వీకరించినయెడల, అతఁడు తిరిగివచ్చినప్పుడు నన్ను కనుగొననిచో! అతఁ డెన్నటికి తిరిగిరాక, ఫలించని మా ప్రణయసంయోగమునకై ఈ వనవృక్షముల శీతలచ్ఛాయలు వేయిగన్నులతో అట్లె వేచియున్నచో!...ప్రభూ! నన్ను దీసికొనిపోవలదు. నన్ను వదలి వెళ్ళినవాడు మఱల నన్ను కనుగొనుటకై యిక్కడనే వదలుఁడు, నన్నతనికే వదలి పొండు.

విక్రముఁడు: అతఁ డెంత అదృష్టవంతుఁడు! అయినను హెచ్చరించుచున్నాను. చక్కఁగా నాలోచించుకొనుము. దేవతలు సైతము మన ప్రేమకు అసూయపడుచున్నారు. నా రహస్యమును దెలిపెద వినుము. నేనుగూడ ఒకప్పుడు ఈ ప్రపంచమునే రోసి ప్రేమలో లీనమై పోయితిని. కాని కొన్నాళ్ళకా పగటికలనుండి మేల్కొంటిని. ప్రేమయే క్షణికమనీ, ప్రపంచమే శాశ్వతమనీ దెలిసికొంటిని. నా మాట యటుంచుము – నీవు వేచియున్న చిన్నవాని పేరేమి?

ఇళ: కుమారసేనుఁడు, కాశ్మీర రాజు.

విక్రముఁడు: ఆఁ! కుమారసేనుఁడా!

ఇళ: మీకుఁ దెలియునా? అతఁడు సర్వ లెఱిఁగిన వాఁడు. కాశ్మీర ప్రజ లాతని ప్రేమించి దేవునిగ పూజింతురు.

విక్రముఁడు: కుమారసేనుఁడా! కాశ్మీరరాజా!

ఇళ: అవును. అతఁడు మీ మిత్రుఁడా?

విక్రముఁడు: అయ్యో! అభాగ్యురాలా! అతని యదృష్ట భాను డస్తమించెనని నీ వెఱుఁగవు కాబోలు. ఇఁక అతని యాశ వదలుకొనుము. పరుగు పరుగున బోయి కలుగు కలుగున దాఁగు వేటాడఁబడిన వన్యమృగము గతియైన దాతని స్థితి. ఈనాఁడు ఈ పర్వతములలో నివశించు అనాథుడైనను అతనికంటె అదృష్టశాలి.

ఇళ: ప్రభూ! మీ మాటలు నా కర్థమగుటలేదు.

విక్రముఁడు: రమణులు తమ హృదయముల మాటున గూర్చుండి ప్రేమింతు రంతియేకాని కాలప్రవాహ మెట్లు గర్జించుచు రయమున బోవుచున్నదో, దాని యలలలో బడి పురుషు లెట్లు పలువైపులకుఁ గొట్టుకొని పోవుచున్నారో వా రెఱుఁగరు. నన్నని యాశాసూత్రమును బట్టుకొని విశాల విషాదాశ్రుపూరిత నయనములతో ప్రియునికై వేచియున్నావు. పాపము! విధాత నిరాశ చెందుమని నీ నొసట వ్రాసెను.

ఇళ: రాజా! నిజము తెల్పుఁడు. నన్ను మోసగింపకుఁడు. నేనతి సామాన్యురాలను, పనికిమాలినదానను, అయినను పూర్తిగా అతని సొత్తును. నన్ను గరుణించి నా ప్రియు డెక్కడున్నాడో, ఏ దారిలేని కాఱడవులఁ దిరుగుచున్నాడో

చెప్పఁడు, దారి జూపుఁడు. ఎన్నఁడూ గడప దాటి యెఱుఁగని నే నాతని వెదుకఁ బోయెదను.

విక్రముఁడు: శత్రుసైనికు లాతని వెదుకుచున్నారు. వారి చేజిక్కి యతఁ డంతమగును.

ఇళ: అయిన మీ రాతని మిత్రులు గారా? మీ రాతని రక్షింపరా? సాటి రా జాపదలోనుండ సహించి యూర కుందురా? ఆర్తరక్షణము రాజధర్మము కాదా? జను లంద ఱాతని ప్రేమింతురే; యీ విపత్సమయమున వా రేమైరి? మీ శక్తిసామర్థ్యములు చాల గొప్పవి కాని గొప్పవారికి సాయపడనిచో అవి నిష్ప్రయోజనములు. సర్వమూ తెలిసియు తెలియన ట్లూరకుందురా? అట్లయిన అబలను, అసహాయను అయిన నాకు దారి జూపుఁడు. అతనికై నా ప్రాణము లర్పింతును.

విక్రముఁడు: ప్రేమింపుము, ప్రేమింపుము, నీ యమూల్య హృదయాధినాథుని యధికముగ ప్రేమింపుము. చేఁజేత నా ప్రణయ స్వర్గమును బోగొట్టుకొంటిని—నీ జీవితమునైన సుఖవంతము చేసితినన్న సంతృప్తిని జెందనిమ్ము. నేనిఁక నీ ప్రేమను గోరను. ఎరువు తెచ్చుకొన్న పూలతో ఎండిన కొమ్మ పుష్పింప నాశింపరాదు. నేను నీ శ్రేయోభిలాషినని నమ్ముము; నీ ప్రియుని నీ దగ్గఱకు తెచ్చెదను.

ఇళ: దయామయా! ఉదారమూర్తీ! నా సుఖమూ, నా జీవితమూ మీకు ఋణపడిపోయినవి.

విక్రముఁడు పోయి పెండ్లికుమారుని వేషముతో సిద్ధపడి నుండును (ఇళాదేవి వెళ్లును) (పా శంగీత శృతిని

మార్చెదను. ఈ యుద్ధము విసుగెత్తించుచున్నది. ఐనను శాంతి చప్పనిది. ఓయి కాందిశీకుఁడా! నా కన్న నీవే ఎంతో అదృష్టశాలివి. స్త్రీ ప్రేమ నీ యపజయమును జయముగా మార్చి, నీ దౌర్భాగ్యమును సౌభాగ్యముగఁ జేసి నీ వెంబబోయినను నీడవలె నిన్ననుసరించి ఏమరని దేవుని కనులవలె కాపాడుచున్నది.

(దేవదత్తుఁడు ప్రవేశించును.)

దేవదత్తుఁడు: నన్ను వెన్నాడు వారి బారినుండి కాపాడుము, రాజా!

రాజు: ఎవరు వారు?

దేవదత్తుఁడు: నీ కావలివారు. అనంతమగు నీ అర ఘడియసేవ నాపై కఠినమైన కాపుంచిరి. కథలుచెప్పి వారికి వినోదము కలిగించితిని. వారిని సంతోషపెట్టుటకై విదూష కుఁడనైతి ననుకొనిరి. అటు తర్వాత కాళిదాసు నాటకముల గానము చేసితిని. శ్రవణపేయమగు నా సంగీతముతో నా మోటు జట్టు జోకొట్టినట్టు నిదురగూరెను. నిన్ను జూచుటకై అష్ట కష్టములుపడి కావలివారిని తప్పించుకొని వచ్చితిని.

రాజు: ఖైదీ కాళిదాసుని కావ్యగానము చేయుచుండ నిదురబోయిన కావలివారి యరసజ్ఞతా దోషమునకు వారిని దండింపవలెను.

దేవదత్తుఁడు: దండన విషయమై తర్వాత యోచింప వచ్చును. ఇప్పుడీ దిక్కుమాలిన యుద్ధమును వదలి యింటికిఁ దిరిగిపోవుదము రండు. అతి సుకుమారముగ పెరిగిన శ్రీమం

తులు మాత్రమే ప్రియావియోగ ప్రణయరోగముతో జచ్చెవ
రని యింతకు పూర్వ మనుకొనెడి వాడను. ఇక్కడికి
వచ్చుటకై యిల్లు వదలినప్పటినుండి కఠినోపవాసములతో
గట్టివాటిన ఈ పేదబాపఁడు కూడ విరహవేదనకు బలిగాకుండుట
కంత అల్పుఁడు కాఁడని తెలుసుకొంటిని.

విక్రముఁడు: ప్రణయము, మరణము వాని ఎరల నేరు
కొనుటలో న్యాయమైనవి. మిత్రమా! నీ వన్నట్లే మనము
రాజధానికి తిరిగి పోవుదము పద. కాని యీ ప్రదేశము వదలి
పోవుటకు ముందు ఒక్క పని చేయవలసియున్నది. త్రిచూరు
పర్వత నాయకుఁడగు అమరుని సహాయమున కుమారసేనుఁడు
దాగియుండు చోటు కనుఁగొనుము. నీవా కుమారసేనుని
కలసికొన్నప్పుడు నేనీక అతని శత్రువును గాననియు, మిత్రుఁ
డననియు చెప్పుము. ఇదిగో మిత్రమా, ఇంకొక మాట.
అక్కడొకవేళ ఆమెకూడ ఉన్నచో—

దేవదత్తుఁడు: అవునవును. అర్థమయినది. ఆమె అను
క్షణము మన తలంపులలో మెదలుచున్నను మనకు మాత్రము
దూరముగ నున్నది. ఆ యుత్తమ యిల్లాలి దుఃఖ మపరి
మితమై యుండవలెను.

విక్రముఁడు: మిత్రమా! ఆమని యాకస్మిక తొలి
మలయమారుతమువలె నీ వరుదెంచితివి. ఇప్పుడు నా భావ
కుసుమములు గతకాల సుఖ స్మృతులతో వికసించును.
(దేవదత్తుఁడు పోవును.)

(చంద్రసేనుఁడు ప్రవేశించును.)

విక్రమ్ముడు: మీకీ శుభవార్త తెలుప కుతూహలముగ నున్నది. నేను కుమారసేనుని క్షమించితిని.

చంద్ర: మీరాతని క్షమించినను స్వదేశమాతని క్షమింపదు. ఈ కాశ్మీరదేశ పక్షమున నే నిప్పుడు న్యాయవహరించుచున్నాను. ప్రజల నిర్ణయమున నాతఁడు బద్ధుఁడు కావలెను. ప్రజల పక్షమున నే నాతని శిక్షించెదను.

విక్రముఁడు: ఏమిటా శిక్ష?

చంద్రసేనుఁడు: సింహాసన చ్యుతుని చేసెదను.

విక్రముఁడు: అసంభవము. అతని సింహాసన మాతని కిచ్చి వేసెదను.

చంద్ర: ఈ కాశ్మీర సింహాసనముపై మీకేమి యధికారమున్నది?

విక్రముఁడు: జయాధికారము. ఈ దేశసింహాసనమిప్పుడు నాది. దాని నాతని కిచ్చెదను.

చంద్ర: మీరు దీని నాతనికిత్తురా? మానధనుఁడగు కుమారసేను, బాల్యమునుండి నే నెఱుఁగుదును. తన తండ్రి సింహాసనమును తమ చేతులనుండి ధర్మముగా నాతఁడు గ్రహించుననుకొంటిరా? మీ పగనైన భరింపఁగలఁడుగాని యనుకంప సహింపఁడు.

(వార్తాహరుఁడు ప్రవేశించును.)

వా.హ: ప్రభూ! కుమారసేనుఁడు ఒక మూఁత బండిలో స్వయముగా లోఁబడ వచ్చుచున్నాఁడని వార్త వచ్చినది. (వెళ్లును.)

చంద్ర: నేనిది నమ్మను. సింహము స్వయముగా శృంఖలముల గోరుకొనునా? ప్రాణమంత ప్రియమైనదా?

విక్రముఁడు: కాని మూఁత బండీలో నేల రావలయును?

చంద్ర: మఱి ప్రజలకు తన మొగమెల్లు చూపఁ గలఁడు? రాజా! అతఁడు వచ్చినప్పుడు దీపమార్పి వేసి చీకటిలో స్వాగతమిండు. వెలుఁగుంచి యవమానింపకుఁడు.

(దేవదత్తుఁడు ప్రవేశించును.)

దేవదత్తుఁడు: కుమారసేనుఁడు స్వయముగా మిమ్ము చూడవచ్చుచున్నాఁడని విన్నాను.

విక్రముఁడు: వచ్చుచున్నాడను వార్త వచ్చినది. సకలోపచారములతో స్వాగతమిచ్చెదను. నీవు మాకు పురోహితుఁడవు కమ్ము. ఒక కల్యాణ మహోత్సవమునకు సన్నాహము గావింప సైనికుల నియమింపుమని మా సేనాధిపతితోఁ జెప్పుము.

(బ్రాహ్మణోత్తములు ప్రవేశింతురు.)

అందఱు: మహారాజునకు జయమగుఁగాక.

ప్రథముఁడు: కాశ్మీర సింహాసనముపై పునః ప్రతిష్ఠితుని జేయ మా రాజు నాహ్వానించితిరని వింటిమి. (శంకరుఁడు ప్రవేశించును.) కాశ్మీర ప్రజల కృతజ్ఞతా చిహ్నముగ మిమ్మాశీర్వదించ వచ్చితిమి. (ఆశీర్వదించి వెళ్లుదురు.)

శంకరుఁడు: (చంద్రసేనునితో) అయ్యా! కుమారసేనుఁడు శత్రువులకు లోఁబడుటకు స్వయముగా వచ్చుచున్నాఁడఁట నిజమేనా?

చంద్ర: ఔను అది యదార్థమే.

శంకరుఁడు: వేయి కల్లలకన్న హేయమైన దీవార్త. అయ్యో! నా ముద్దులయ్యా! ఈ వృద్ధసేవకుఁడు పడిన బాధలా భగవంతుఁ డెఱుఁగును. అయినను ఒక్కనాఁడైన మొఱపెట్టి యెఱుఁగడు. ఇప్పుడీ యవమానము నెట్లు భరింపఁ గలఁడు? ఈ శత్రు శిబిర గహ్వరమున బ్రవేశించుటకే నా కాశ్మీర కేసరి యీ దుర్గమారణ్య మార్గములన్నిటిని దాటి వచ్చినది? అయ్యో! ఇంతకుముందే యీ నీ వృద్ధసేవకుఁ డేల మరణింపఁడాయె?

(ఒక సైనికుఁడు ప్రవేశించును.)

సైనికుఁడు: దేవా! శకటము వాఁకిట నున్నది.

రాజు: ద్వారపాలకుల హస్తముల మంగళ మేళములు లేవా? పెండ్లిపాటల పాడుమనుము. (ద్వారమును సమీపించి) రాజమిత్రమా! రమ్ము, నీకు నా హృదయపూర్వక స్వాగతము. (చేతిలో నొక మూసిన పళ్లెరముతో సుమిత్రాదేవి ప్రవేశించును.)

విక్రముఁడు: ఆఁ-నీవా సుమిత్రా?

సుమిత్ర: అవును మహారాజా! మీ ప్రజల క్షేమమును మీ గౌరవ ప్రతిష్ఠలను లక్ష్యముచేయక ఎల్లెడల విలయశక్తుల వ్యాపింపఁజేసి కొండలలో, గుహలలో, అడవులలో అహోరాత్రము లెవరికై వెదకించి వెదకించి విసిగి వేసారితిరో, ఎవని శిరముపై మృత్యుదేవత మకుటమునకంటె ప్రకటమగు రాజ ఠీవితోఁ గూర్చున్నదో అతని యుత్తమాంగమును, మీరు కోరిన యీ శిరమును నాచే మీ కంపినాఁడు. గైకొనుఁడు. (కుమారసేనుని ఖండిత శిరమును వెలికిఁ దీయును.)

విక్రముఁడు: హా! నా రాణీ!

సుమిత్ర: ఆర్యా! నే నింక మీ రాణిని గాను. కరుణ గల మరణము నన్ను వరించినది. సెలవు. (పడి చనిపోవును.)

శంకరుఁడు: హా! కుమారసేనా! నా మహారాజా! నీ ఘనతకు తగినట్లు చేసితివి. ఈ నీ కీర్తియే నీకు అమర సింహాసనమైనది. దేవుఁడు నన్నింత కాలము జీవింప నిచ్చినది యీ నీ యశఃకాయమును గాంచుటకే. ఇఁక నాకు కాలము తీరినది. నీ సేవకుఁడు నిన్ననుసరించుచున్నాఁడు. (వెళ్లును.)

(ఇళాదేవి పెండ్లియుడుపుల ధరించి ప్రవేశించును.)

ఇళ: ప్రభూ! వివాహ మంగళ సంగీతము వినవచ్చు చున్నది. నా ప్రియుఁడేడీ? నేను పెండ్లికి సిద్ధముగ నున్నాను.

—: సంపూర్ణము :—

.

# బలి

## తప్పొప్పుల పట్టిక

---

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 21 | 7 | నాటమును | నాటకమును |
| 23 | 4_5 | వెలయుచుయుండును | వెలయుచుండును |
| 28 | 22 | పులకు | పులకు |
| 40 | 11 | మమ్ము | మిమ్ము |
| 42 | 13 | మనసులోనే | మనలోనే |
| 43 | 15 | అనక | ఆనక |
| 45 | 13 | కదిలే | కదలే |
| 46 | 3 | దీసుకొని | దీసికొని |
| 49 | 18 | తిజముగా | నిజముగా |
| 50 | 10 | దొరుకునో | దొరకునో |
| 52 | 8 | చర్యలలో | చర్చలలో |
| 52 | 19 | జరుగునున్నది | జరుగుచున్నది |
| 54 | 22 | భాతృ | భ్రాతృ |
| 64 | 2 | తొలగింపనిచే | తొలగింపనిచో |
| 65 | 5 | నిలయము | విలయము |
| 73 | 2 | నెత్ర | నెత్తి |
| 76 | 8 | యిదండయు | యిదంతయు |

1_0

## రాజు - రాణి

| పుటం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 84 | 20 | వారి | వారీ |
| 85 | 15 | విశ్యాస | విన్యాస |
| 86 | 19 | దొరుకును | దొరకును |
| 87 | 1 | చేసుకొని | చేసికొని |
| 87 | 1 | వానిపై కుక్కి | దానిపై కెక్కి |
| 88 | 9 | అందురు | అందుకు |
| 91 | 23 | విదుపులఁ | విడుపులఁ |
| 93 | 4 | కుందురు | కుందువు |
| 93 | 11 | ఆడవారి | ఆఁడువారి |
| 94 | 2 | దవమున | దనమున |
| 94 | 23 | అవమానములు | అనుమానములు |
| 96 | 6 | వార | వారి |
| 103 | 15 | ఆడ | ఆఁడు |
| 106 | 18 | మెల్లగా | మెల్లగా |
| 108 | 22 | మించినవి | మించినది |
| 110 | 18 | దేవతలు | దేవతలు |
| 112 | 18 | ఎరువు | |